# హరిజనుల పాటలు.



గరిమెళ్ల. సత్యనారాయణ.





వెల రూ. 0-2-0.

# FOREWORD.

Mahatma Gandhi's concentration on the removal of untouchability from Hindu Society has stirred the whole country is a manner that nothing else could have done. He has awakened the soul of the Harijans no less than that of the other Hindus. Mr. Gurimella Satyanarayana has given very apt and faithful expression to the feelings and longings of the Harijans in the small bunch of songs that he is now publishing. I trust that some if not all of them will be learnt and sung with affection in the hamlets of the Telugu districts. I commend them with great pleasure to Pracharaks and other workers in the cause of Harijans

V. VENKATASUBBAIYA,
*Servants of India Society,*
*Royapettah, Madras.*
*18-2-1933.*

---

# మున్నుడి.

శ్రీగాంధీ మహాత్ముని ఉపవాసప్రారంభమునుండియు అస్పృశ్యతా నివారణోద్యమమున కపూర్వ త్వరితగమన మలవడినది. సంస్కారులకు చురుకుతనము కలిగినది. సనాతనులకు పట్టుదల కొంచెము బిగిసినట్లు కనబడినను, సమస్యనుగూర్చి తీక్ష్ణముగు ఆలోచనయు, కొంతవరకు స్వయంకృతాపరాధ జ్ఞానమును—శాస్త్రసిద్ధమైనంతవరకైనను—సంస్కారము యొక్క సత్వరావశ్యకతయు స్ఫురించుచున్నవి. కొండ లక్ష్యవచ్చినను సర్వసమ్మతములగు మార్పులు

జరుగును గాని తప్పవు. ఇట్టి శుభసమయమున సాహిత్యలక్ష్మి సర్వాలంకార శోభితమై, కథలు, కల్పనలు, వ్యాసములు, హరికథలు, నాటకములు, గీతములు మొదలగు కావ్యముల రూపమున మానవ రసజ్ఞులయందు నటనములు సల్పగడంగుట ఎంతయు సహజము. అట్టి సాహిత్యములో నిదియొకటి.

మదరాసు నగర హరిజన సేవాసంఘ కార్యదర్శి శ్రీయుత వి. వెంకటసుబ్బయ్యగారు దీనికభిమాన పూర్వముగ మున్నుడి వ్రాయుటయేకాక, పాటలు బహుజన గ్రాహ్యములగునట్లు పెక్కు సవరణలు సూచించి దిద్దిపెట్టినారు. ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవా సంఘాధ్యక్షులు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు వీనిని ప్రచురించుటకు పురికొల్పియు ప్రకటించుట కంగీకరించియు మిక్కిలి ప్రోత్సాహము నొసగినారు. వారిరువురకును కృతజ్ఞతా సూచక వందనము లర్పించుచున్నాను.

ఇట్లు,
విబుధ విధేయుడు,
గరిమెళ్ల - సత్యనారాయణ.

మైలాపూరు,
18-2-1933.

---

*For copies apply to:—*

GARIMELLA SATYANARAYANA,
*5, Cutchery Lane, Mylapore, Madras*



శ్రీ

## 1. గాంధీ మహాత్ముని

యుపవాస ప్రారంభ సమయమున పాడబడిన హిందీ పాట.

ఉఠజాగ ముసాఫిర్ భోరభయీ। అబ్ రైన కహాఁజో సోబతుహై
జో సోబతుహై వహ్ ఖోబతుహై। జో జాగతుహై వహ పావతుహై ॥ఉ॥

టూకునీంద సే అఁఖియా ఖోల్జరా। ఓ గాఫిల్ రబ్సేధ్యానలగా
యహ్ ప్రీతి కరనకీ రీతినహీ। రబ్ జాగతుహై తూ సోబతుహై ॥ఉ॥

అయిజీవన్ భుగత కర్నీ అప్నీ। ఓపాపీ పాప్మే చైనకహా
జబ్ పాపకీ గఠడీ శీసుధరీ। ఫిర్ శీసు పకడు క్యోం రోబతుహై ॥ఉ॥

జోకల్కరే వహ ఆజ్ కర్లే। జో ఆజ్ కరే వహ్ అబ్ కర్లే
జబ్ చిడియా ఖేతీచుగతుడారీ। ఫిర్ పచ్తావే క్యా హోబతుహై ॥ఉ॥

### పై పాటకు ఆంధ్రానువాదము

అరుణోదయమయ్యె ముసాబరి మేల్కొనరా! నిశికాదిది నిద్రిలగా
తరుణంబున లేచినవానిది సర్వము। తద్దయు నిద్దురబోతు చెడున్ ॥అ॥

సోమరి నిద్ర విగుల్చుము। కళ్లఱ। విచ్చి ప్రభుంధ్యానించుముదక్
స్వామి సుజాగ్రతనుండగ నిద్రిల। సాగుట ప్రీతికి రీతియొకో? ॥అ॥

పాపీ జీవన సుఖమును గ్రోలుము। పాపములో సుఖమెక్కడరా
పాపపు మూటను దాల్చి శిరస్సును। పట్టుక యేడ్చిన నేమగురా? ॥అ॥

రేపు చేయగల కార్యము నేడే। చేయుము; రేపటి దిప్పుడెసూ
వాపోసిన ఫలమేమిటి చేలను। పక్షులు మ్రుచ్చిలి మేసిచనన్? ॥అ॥

---

## 2. హరి జనులము.

హరి జనులము మనము - దుఃఖము లనుభవించ మికను
పరిసమముగ తక్కిన జాతులతో - సంస్తుతినందుదము ||హ||

స్నానము లాడుదము దేహము - స్వచ్ఛము చేయుదము
మానక అలుకుదము ఇండ్లను - మడిగానుంచుదము ||హ||

మునివాకిళ్లన్నీ తుడిచి - ముగ్గులుపలుపెట్టి
ఘనులందరు దర్శించుటకును ఆ - కర్షణ గూర్చుదము ||హ||

వెల్లలువేయుదము - గోడలు - తెల్లగ జేయుదము
సొగసగు రంగులతో ద్వారములను - సింగారించెదము ||హ||

తెల్లటి బట్టలను ధాలిచి - తేటగ తిరుగుదము
పిల్లలనందటి బడులకుపంపి - విద్యలు నేర్పుదము ||హ||

సభలకు వెళ్లుదము - పెక్కు సంగతు లెఱుగుదుము
విభవమునందే వృత్తులు పూని - విడువక చేయుదము ||హ||

భయమును మానుదము దేశ - భక్తిని పూనుదము
రయముగ మనమందరము తరించెడి - పనులను చేయుదము ||హ||

కల్లును విడుచుదము క్రూరపు - కర్మలు తుడుచుదము
ఎల్ల జీవములపై దయదాలిచి - యింపుగ బ్రోచుదము ||హ||

మూర్ఖాచారములన్ - మరియును మూఢ మతంబులనున్
సమూలముగా విడనాడి జగత్ప్రభు - సంస్తుతిపాడుదము ||హ||

భజనలు సలుపుదము పుణ్య - వ్రతములు సలుపుదము
సుజనులతో కోవెలలో శివునకు - జోతలు పెట్టుదము ||హ||

---

## 3. జ్ఞానోదయము.

ఇన్నాళ్ళ మాలోళ్ల మంటూ మీది మీది । కెగిరిపడకుండయ్యామీరు
కన్నతండ్రి గాంధి కళ్లు విప్పేశాడు। కనుక్కోండి మీరు మేమొకటే ॥ఇ॥
చెరువుల్లో నూతుల్లో బాటల్లో సత్రాల్లో - స్వేచ్ఛగా తిరుగుతామండి
మమ్మరమర పెట్టకండి అందరిలాగే ఆదరముతోడ మాటాడరండి ॥ఇ॥
రెయిలూ బస్సూ పడవా - రేయీ పగటిబడులు - రొక్కమిచ్చిన
[వారివల్లా
ఇంక హాయిలుచూపి మమ్ము - ఒత్తిగిల మనకుండా - ఒప్పుగానే
[కలసుకోండి ॥ఇ॥
చింకిపాతలవారు చీడ వాళ్లువారు - తెలివి తక్కువ వారలంటూ
మమ్మికింక పెట్టకండి - కించిత్తు డబ్బుంటే - ఇంకిపోతా యివ్వియెల్ల ॥ఇ॥
చేసిన కష్టముకు వాసిగాకూలిచ్చి - చిరపుణ్యమును కట్టుకోండి
మా మాసిన బ్రతుకెల్ల మరియాదలకు వచ్చి - మహిమ గూర్చును
[మీకుకూడ ॥ఇ॥
పదిమందిలోనికి రానీకుంటే మాకు - పడివచ్చునా, మీమతీరు?
త్రుళ్ల గదిమిత్రోయుట మంచి మర్యాదస్థులకును - ఘనకీర్తి
[యా చెపుడుమీరు ॥ఇ।
భక్తులుచూస్తే గుళ్లు మయిలపడతాయనుట - పరమ సిద్ధాంతమటండి?
ఇట్టియుక్తులు పట్టి పెద్ద ఉరిత్రాళ్లు కట్టిమా - ఉసురెల్ల పోసుకోకండి ॥ఇ॥
జాతీయ జీవతరంగిణి పారెడి - జాలైనజూచి పొంగండి
పట్టి. ప్రాత ప్రతిష్ఠల పట్టి వ్రేలాడక - పాతకవితతి చెండండి॥ ।ఇ॥
హిందూ జాతి సన్నగిల్లి పోవుటమమ్ము - ఈసడించుటచేతసుండి
సందేహములుమాని సర్వసమతగాని! సౌఖ్య పథమును బట్టుకోండి । ఇ॥
మన జాతికికమీద । మంచి దినంబులు మగిడివచ్చుట నిశ్చయంబు
ఘనులెల్లరును మాదు । మనికిగూర్చి యిట్లు - కష్టపడిన కారణంబు ॥ఇ॥

## 4. నూతన తేజము.

సందు విడచిరార తమ్ముడా - పెద్ద సభ జరుగుతున్నాది తమ్ముడా॥
ఇండియాదేశమట - ఎల్లారునొకటంట
ముందరబడులంట - ముచ్చట చదువులంట
అందము గుండాలంట - ఆరోగ్య విధులంట
పొందుగ జీవనమంట - పురిషిట్లోధనమంట
ప్రతివాడికోటంట - ప్రతినిధినంపాలంట
ఇదియేటోమనకిమే - తెగిరేలాగున్నాది ॥సందు॥

హరిజనులమట మనము - అయిదుకోట్లమంట
హిందూ సంఘముయొక్క - ఇంపైన కొమ్మంట
విడతీయుటకు సుంత - వీలేలేదేనంట
విడతీస్తే గాంధీ ఉసు - రిడుసుకుంటాడంట
సీమ దొరతనమారే - శిరసు వంచేరంట
ఏమూల మనగోడవ - లే సెప్పుకుంటారు ॥సందు॥

పంచా సొక్కాతొడిగి - పైమీదతుండేసి
పట్టినామాలెట్టి - బొట్టుసక్కగదిద్ది
పదిమందిమీకలిసి - పడతులతోను మెలసి
బహిరంగ సభలల్లో - బాగుగకూరుచొని
చెప్పిన దల్లావిని - చిత్తము కెక్కించుకొని
ఒప్పుగ చెయ్యెత్తి - ఓటియ్యవాలంట॥ సందు॥

ఆడోరు మగవారు - అదియేటి లెచ్చెర్లు !
గ్రుక్క విడువకుండ - కురిపించేస్తున్నారు !
చెవిటోళ్లకైనాను - తెలిసిపోతున్నాయి
ఇన్నాళ్లు మననెల్ల - ఈసడించారంట

ఇప్పటినుంచి ముందు - కైత్తసంసిద్ధులట
తప్పకుండా మనము - ధన్యులమైనాము॥ స౦దు॥

రాముడి పటముపట్టి - రండోయి పాడుదము
ఆమూల ఈమూల - అంతట తిరుగాడుదము
మామూలాచారములు - మంటల్లో కలుపుదము
సోమరితనము కల్లు - చొరనీక గెంటుదము
దేముడిగుడి తలుపులను - తెరవుమని వేడుదము
సామికిపత్రం పుష్పం - సమర్పణ చేయుదము॥ స౦దు॥

---

## 5. ప్రార్థన.

మీవారివలెమమ్ము సాకండీ - భేదమేమీమదిని పెట్టుకోకండీ॥

ఓయిసనాతన - ఒజ్జల్లారమమ్ము
హాయిగుండమని - ఆశీర్వాదించండి
హేయజీవనముమే - మింక సహించము
మీయందరి లాగేమేల్మివ - హించెదము
నాయనలారా వంద - నములివ్వొ చేసెదము
మీయనుగు తమ్ములపై - మీకు కోపముతగునా? మీ॥

అద్వైత మార్గంలో - ఆరితేరినవారు
భక్తి మార్గములోన - పండితులైనవారు
ముక్తి మానవునికి - ముఖ్యమనెడివారు
శక్తి యీశ్వరునుండి - సమకూడుననువారు
నిత్య కర్మలందు - నిపుణులైనవారు
సత్యముగా మమ్మొంచ - సాహసము తగునా? ॥ మీ ॥

మాలోమాత్రంఘనులు - మఱిపుట్టనేలేదా?
హిందూ ధర్మంకీర్తి - హెచ్చింపనేలేదా?
మందులకు ధర్మ - మార్గం తెల్పేలేదా?
బంధువులుగా వార్ని - పెద్దలెంచేలేదా?
సందేహములు మాని - శాస్త్రాలనే గాని
కనుగొందులము మమ్ము - కరుణించికావండి ॥ మీ ॥

మాలో పలువురుపర - మతములపాలైతే
ఆలోచించకుండా - ఆదరించుతారు
మాలోళ్లంటేనేనా, మనసుకుములుతాది?
మేలైనవామనవి మించి - ఆ సంఘాలు?
కాలమిట్లాటిదని - కన్నీళ్లు విడువమా?
జాలి నీతి ధర్మం - చచ్చెనని యేడ్వమా? ॥ మీ ॥

మనమంతా ఒకటైతే - మతమే పోతుందని
మనసులోపల మీరు - మరగిపోకండయ్యా
కనువిచ్చిచూచితే - కాలచక్రంలోను
అనుమానమేలేదు - అంతా ఒకటైనపుడే
మతమైనా ఘనతైనా - మఱివన్నె కెక్కేయి
విడిపోయినప్పుడే - చెడిసన్నగిల్లేయి ॥ మీ ॥

## 5. హిందూ సంఘీయులము.

హిందూ సంఘమురా మనది - యెవ్వడుకాదనురా
సందేహించినవాడే వేఱొక - సఘంబై చెడురా ॥ హిం ॥
రామచరిత మనది - దాని - రచయితమనవాడు
భారతము మనది - ధర్మ - వ్యాధుడు మనవాడు ॥ హిం ॥
భాగవతము మనది - అందలి - చెంచిత మనపడుచు
ఏగొడవనుగాంచిన మనమటకని - పించనిదేలేదు ॥ హిం ॥
వల్లీ మనపిల్ల - మనకు - అల్లుడు మురుగయ్య
ఎల్లెడలను మన చుట్టాలేసుమి - హిందూదేములలో ॥ హిం ॥
వేదంబులు మనవి - అందలి - వివరంబులు మనవి
బహు దేవళముల పంచమ భక్తుల-ప్రతిమలు లేవాకో? ॥హిం॥
మన పెద్దలుకూడ ధర్మ - మార్గము తెలిపేరు
భక్తిని కలిపేరు - ఈశ్వర - శక్తిని చూచేరు ॥ హిం ॥
ఎల్లరి హితమునకై - జీవన - మెటులోగడచుటకై
ఏవృత్తిని సక్రమముగ జేసిన - నెసగెడి తప్పేమి? ॥ హిం ॥
అంతమాత్రమునకే మనలను అంటుట తప్పంటే
పాపపు జన్మంటే వారికి పుణ్యామె తక్కువగుఁ ॥ హిం ॥
ఎప్పటిమాటలనో మాపై - త్రిప్పివిసరకండి
ఇప్పటినుండి సమముగ మనుతెర - వేదో వెదకండి ॥ హిం ॥
కలసి మెలసినపుడే సౌఖ్యము - కలుగును నందరకు
విడబాటున దుఃఖం బెప్పుడును - నుడుగదు ఇరువురకు ॥ హిం ॥
నిట్టలు పడగొట్టి - గృహమును నిలబెట్టుకొనంగా
ఎట్టుల సాధ్యంబో మదినూ - హించుకొనరదేమి? ॥ హిం ॥

---

## 6. అస్పృశ్యతా సిద్ధాంత నిరసనము.

అంటరానివాడని న - న్నంటే ఇక ఒప్పుకోను
ఒంటరి! నీ కిష్టము - లేకుంటే అటు తొలగిపొమ్ము ||అం||

నీగుమ్మము కడకేగి - నిను తాకగ మనసులేదు
నీతాకుడువల్లనె నే - నేమో ఘనతందబోను ||అం||

నీవే ఘనజాతివని - నేనేమో నీచునని
లోనదలంచినచో నీ - లోనే విషరణమౌసుమి ||అం||

నీవలె పుణ్యులకడుపున - నేమాత్రము పుట్టలేదో!
జీవనమును సక్రమముగ - జేయగలేదో చెప్పుము ||అం||

సిరియును నుద్యోగమునా? - చేకురవచ్చును మానును
గరువంబున మత్తిల్లుట - కా? రెండును సద్వరములు ||అం||

నీవలె కష్టముపడియా - ర్జించి పన్ను చెల్లింతును
ఈ విశాలభూమిని నీ - వెంతో నే నంతేసుమి ||అం||

నన్ను తొలగమని నీవును - నిన్ను తొలగమని నేనును
ఎన్నడు కసరగరాదు - ఇది యేమన నిర్ణయము ||అం||

నాసౌఖ్యము కొరకీవును - నీసౌఖ్యము కొరకేనును
వాసిగబహు కష్టంబులు - పడవలెననుటయె ధర్మము ||అం||

వసుధను సజ్జనులకు స - ర్వమును నొకకుటుంబమెయగు
విసుగొందడు పరజనహిత - వృత్తి వ్రతుడెన్నండును ||అం||

జగమంతయు నుండగనీ - సర్వాసహ్యామునూపయు
భగభగ మనిపించుటయది - పరువో పురువో చెప్పుము ||అం||

వేదాదుల యర్థమును వి - వేకముతో గ్రహియింపుము
లేదా వాటి ప్రసంగము - లే, యిక నెత్తగబోకుము ||అం||

## 7. వింతసనాతన మతము.

వింతయైన సనాత్న ధర్మము - వెలసెనిప్పుడు కనుము రా
పంతులుగార్లందఱున్ను - పలుకు పలుకులు వినుము రా ||విం||

వేదశాస్త్రి పఠన విడిచి - హరాణమే మాట్లాడిన
లేమసేగియొకింతయట ఆ - లించు మాధర్మంబుకు ||విం||

జపతపంబులుమాని బహువిధ - చాకిరీలనుచేసిన
నర్తకంబులు సలిపినా లో - పంబు కొంచెమురాదట ||విం||

మాలత్రిప్పటమాని రొక్కపు - మూటలే లెక్కించినా
లీలలను క్రేలాడినా ఒక - లేశమింతయు రాదట ||విం||

వనములను పల్లెలను విడచి - పట్టణంబులు మఱిగినా
ఘనతకోసము క్లబ్బులో చా - క్కముగ నెద్ది భుజించినా ||విం||

దొరలకీర్తనిపాడి, పరసుం - దరుల నూర్తులకూడినా
కరువు జీతముకొరకు నెట్టి - కష్టకొలువులుచేసినా ||విం||

చట్టమునకు భీతిల్లి పెండ్లి - జవ్వనులకే చేసినా
చిట్టిపిల్లను పెద్దదేయని - చెప్పి కల్లలనాడినా ||విం||

ఇడ్లి కాఫి భుజించి తద్దిన - మెచ్చటను పెట్టించినా
దొడ్డగంధముపెట్టి కోర్టున - దొంగసాక్ష్యము చెప్పినా ||విం||

కలరు సోడా త్రాగినా - క్రాపుపాపిడిపెట్టినా
జలధిదాటి విదేశయాత్రలు - సలిపి యింట్లోదూరినా ||విం||

సీమ బిస్కట్టులను పాలను - చేలములను వాడినా
నీమమున కే మాత్రమైన - సిగ్గు తగ్గబోదట ||విం||

సనాతనతకు నెల్ల యొక పం - చముకె ఇప్పుడు గుత్తయట
వినూతనాచారములు తెచ్చి - విసరికొడుతున్నామట ||విం||

న్యాయమునకు సనాత్న ధర్మం - బునకు చేసువ లేదట
అన్యాయమైనా, సనాత్నధర్మము - న్యాయమే అనవాలట ||విం||

తాముచేసిన తప్పులెవ్వరు - తలచుకోననేరాదట
పామరుల పంచముల మాత్రము - పట్టి యెడబెట్టాలట
లేకుంటె గుడికేపోరట - కలనైన రామా అనరట
ముక్కంటి ముకుపుల నీరట - గుడులెల్ల పాడౌతాయట
దేవుళ్లు పరుగెడుతారట - దేశమున యుద్ధములౌనట
సవర్ణులును అవర్ణులును - సంస్కారులును ఆచారులును
సర్వులును రక్తములోనమునిగి మ - హా ప్రళయమేకూడిభువినే
దారితోచక గ్రుడ్డిదై సర - కారు పంచల పాలునౌనట ॥౭౦॥

---

## 8. ఎటువంటి మాలలము!

మాలలము వనమాలిశిరంబున + గ్రాలెడి తులసీమాలలము
మాలలము త్రిశూలిగళంబున + వ్రేలెడి కపాలమాలలము
సుశీలురము జగతీతలమంతను + శుభ్రముచేసెడి సేవకులము
లయకాలురము అఘకానన సంతతిఁ + గాల్చెడి జ్వాలాకారులము ॥

హిందూధర్మ వ్యవస్థను మాకొక + ఇంపగు స్థానంబున్నయది
మందులమై మనకుండా దానిని + మాన్యముగా నెరవేర్చితిమి
అందరివలె చరియింపగనీయక + అడ్డమువచ్చెడివారెల్ల
చిందరవందర యాదురధర్మ + చ్ఛేదక నూతన యత్నములో ॥మా॥

జపములు సేయుడు తపములు సల్పుడు + జన్నిదములువడకండెపుడున్
నిపుణతతో డుత మోక్షమువైపుకు + త్రిప్పుడు జగతిని వీత్తైన్యన్
చపలత సంసృతి పథమున జారుచు + చచ్చుచు పుట్టుచు నీలుగుచున్
కపటముగా మాపైపడబోయిన + కలుషముగా మనిందలచరుకో! ॥మా॥

బ్రాహ్మణులా పదిరూకలకోసము + పామరసేవలు సేయుదురు
క్షత్రియులా సలాములు చేసి గు + లాములకై వెలుగొందుదురు
వైశ్యులు రుసుములకై జనసంఘపు + వైభవమెల్లయు తుడిచెదరు
ఎల్లరు నిష్టమువచ్చినయట్టుల + నే జీవములో దొరలెదరు

వర్ణమదెక్కడ ఆశ్రమమెక్కడ + వంటను తింటను అంటుటను
మెడగంటులలో నెడ సేతలె జాతికి + మేలగు ధర్మపుమూలములా?॥మా॥

ఇది వర్ణాశ్రమ ధర్మంబేమిటి? + మదినమ్మెడి మూఢుండెవడు?
ఏదొ సమయానుగతంబగు పథమున + నేగుచునుంటిమి నమ్రులమై
మదినిక నిక్కలదేటికొ తెల్పుడు + మహిమాఢ్యులమని అల్పులని
విదితముగా నెల్లర మొక టే లా + కిక విద్యలలో తేరినచో
బడులును కొలువులుపదవులుసభలును+బహుసమృత్తులును తెరచుకొ నెస్
గడియలు మూసిదా చతరంబెజ + గన్నాథుని ఈజగమునకుర్ ॥మా॥

శుద్ధంబగు వర్ణాశ్రమ ధర్మము + శోభిలచేయుదు రేయేనిక్
నిషిద్ధంబందు అస్పృశ్యంబనునొక + నీచపు వర్ణము నిశ్చయము
అబద్ధంబగు జాత్యభిమానము వ + ర్ణాశ్రమ మనిభ్రమమండకుడీ
బుద్ధిగలారలె పెద్దలు ఇతరులు + బుద్ధిగరచి పెద్దయ్యెదరు
విద్దెను బాగుగ నేర్చెదము + విత్తంబును చేకూర్చెదము
హద్దును చెఱచి అందఱితోను + హాయిగ సరిగానుండెదము ॥మా॥

కలియుగమందున బలమెల్లయు సం+ఘము దేయని శాస్త్రముచాటుగ్
అధునాతనమున అధికారము సా+మాన్యులదందురు పాశ్చాత్యుల్
అయిదుకోట్ల జనమును నేకంబయి + నప్పుడు చేయగలేమెద్ది?
ఖయిదీలవలెం జరియింపము మఱి + ఖామందుల మే అయ్యెదము

బడులు మావియని + బాటలుమావని
సభలు మావి స + త్రములు మావియని
దేవాలయములు + తెరవులు మావని
ఆచారము వ్యవ + హారము మావని
దొరతనమును పైను + పదవులు మావని
అరచి చరచి గ్రహి + యించక పోదుమె ॥ మా ॥

కాడుకాచిన హరిశ్చంద్రునకు + కట్టుదు మొక్క దేవళము
వ్రేలు నిచ్చిన యేకలవ్యునకు + వేడుక చేతుము ఉత్సవముల్
అద్భుత దివ్యత్వము గణియించిన + అరుంధతికిని పెను జాతరులు
నందనారు పెనుపండుగలోపల + వందలకొలది నాట్యములు

ముందరచూచిన + వెనుకనుచూచిన
విందులుచూచిన + వింతలుచూచిన
సందులుచూచిన + సంతలుచూచిన
పొందులుచూచిన + పొరుగులుచూచిన
అందఱిలోపల + నందఱమై, పెను
సందడిలోపల + సంపదిమై
ముందుకు దేశం + బంతతో పోదుము
ముహ్యాము చేతుము + లోకంబంతను || మా ||

సందేహంబించుకయును లేదు + చక్కనిదీ హిందూమతము
మందముగా వ్యతిరేకముగా పెను + సందడి కొంతచేసినను
ముందర దృష్టిని కలిగి మార్పుకు + పొంకుగనొదలవంచెదను
గందరగోళములన్నికూడా + క్రముగ నవియే సరిపడును

వందలకొలదీ + శాఠోత్సమ్ములు
సందడినీార + గెంతుదము
బంధములన్నీ + తెంచుకొని యొక
పందెముగా పరు + గెత్తెదము
భారతమాత + కొలువునుచేసి
పావన జన్మల + మయ్యెదము
మానవ జాతిని + శుద్ధముచేసి
మంగళ గీతము + పాడుదము || మా ||

---

## 9. క్రొత్త తీరులు.

ఇన్నాళ్లవలె కాదురా-మన-మెన్నో నేర్చుకొనియెన్నికగాంచాలి ॥ ఇ ॥

ఆవు మాంసముమీద + ఆశను విడవాలి
గోవును తల్లిగనెంచు + కొని పూజసేయాలి ॥ ఇ ॥

చచ్చిన జంతువుల మాం + సము తినుటమానాలి
పుచ్చిన వస్తువులన్నీ + పొలములలో విసరాలి ॥ ఇ ॥

ఎంగిలి వస్తువు లెప్పు + డేవగించవాలి
దొలిగలతో నేస్తాలు + తొలగించుకోవాలి ॥ ఇ ।

స్నాన ధ్యానంచేసి + చక్కగనుండాలి
మానక పెద్దలు చెప్పిన + మాటలు వినవాలి ॥ ఇ ।

ఆర్యుల ధర్మాలన్నీ + ఆలకించవాలి
కార్యంపట్ల మనము + ఘనముగ చెయ్యాలి ॥ ఇ

రాతిరిబడిలో చదువు + వ్రాతలు నేర్వాలి
ప్రీతిగ సభలకు వెళ్లి + పెద్దలముకావాలి ॥ ఇ

బాలుర బాలికలను + బడిలోకి పంపాలి
వీలైనయంత వి + వేకమునేర్పాలి ॥ ఇ

కల్లును మానాలి + ముల్లెను చేర్చాలి
త్రుళ్లిపడుటమాని + శ్రీరముగానడవాలి ॥ ఇ

సాహుకారుల బాధ + సవరించుకోవాలి
సహకార సంఘాల + సాయమును పొందాలి ॥ ఇ

వ్యవసాయం చెయ్యాలి + వర్తకం చెయ్యాలి
అవసరమైన వృత్తు + లన్నిన్ని చెయ్యాలి ॥ ఇ

ఆటల నాడాలి + పాటలు పాడాలి
నాటకములు సలిపి జ్ఞా + నము కూడా పొందాలి ॥ ఇ ॥

ఇన్నీ చేసితేను + ఇప్పుడున్నభేదా
లన్నీ తొలగిపోయి + అందరివలె నౌదుము ॥ ఇ ॥

---

## 10. సర్వసమత్వము.

విపరీత భావంబుతోను - నీవిట్లు - విఱ్ఱవీగి చెడకుమన్న
కపటవర్తన తప్ప నీకు - అందున - కలిగే లాభంబేమొసున్న ॥ వి ॥

క్రొత్తలోకం బొరియుద్ది - నీకళ్లు - కొంచెం విప్పిచూచుకొద్ది
జనమొత్తంమీద కలెగెమార్పు - నీకు - ముచ్చటగా తెలియునీసుద్ది ॥ వి ॥

ఎచ్చుతగ్గుమాటలింక - ఇప్పు - డెవరు విన్న నవ్వుతారు
విచ్చలవిడిగా వృద్ధిపొంద - పెక్కు - వివిధములెంతయు నలరారు ॥ వి ॥

ఎడముదగ్గరన రాదు - ఎల్ల - రెక్కినా మొక పడవలోన
ఒడబడక దిగ బడినవాడు - దూర - మొదిగి అదృశ్యుడైయాను ॥ వి ॥

అందఱిలోన కలసినావు - కాస్త - ముందరకూడ యేగినావు
నిందయేమీ లేదు మమ్ము - కాస్త - ముందుకు లాగివేగ రావు ॥ వి ॥

లోకమంతయు తెల్లవాఱె - మాకు - లోచనములు విడబారె
చీకుగొందుల నుండుమంటే - మేము - చెవిచేర్చ మామాటసారె ॥ వి ॥

భూదేవిలోకమందఱిది - అందలి - భోగములందఱివిన్ని
కాదని యదము నెంచువార్ని - ధర్మ - కామధేనువు పొడుచుతన్ని ॥ వి ॥

నీసుళువు నీవుచూసుకొంటూ - నన్ను - నాసుళువు చూడవద్దంటే
భేషునీశాస్త్రిలపైని - మాకు - ప్రేమమెట్టుల కలుగుకంటే! ॥ వి ॥

పామరత్వము వీడవాలి - ధర్మ - పథమునందున సాగవాలి
లేమిడిని చెండవాలి - సౌఖ్య - లీలలనోలాడవాలి || వి ||

చదువు సంపద యలరవాలి - దేహ - సౌష్ఠవ మలరారవాలి
కదిసియొకటిగ నిలవవాలి - దుఃఖ - గణముల నెదిరించవాలి || వి ||

జాతిగొప్పను పొందవాలి - సర్వ - జగము మెప్పును పొందవాలి
భూతదయయునుండవాలి - పరి - పూర్ణజ్ఞాన మలరవాలి || వి ||

---

## 11. భారతదేశ ప్రతిభ.

### పురుషులు.

ఈతచెట్టు లెక్కటమాని - తాటికల్లు త్రాగుటమాని
విప్పసారా వండుటమాని - వీధుల వెంటగెంతుటమాని
చల్లని వృత్తులు బూని మనము - సంసారములు చెయ్యాలో ||
[రయ్యో కొయ్యోడ||

### స్త్రీలు.

తుప్పలవెంట చితుగులకోసం - తోటల వెంట పింజెలకోసం
అడవులవెంట ఆకుల కోసం - కొండలవెంట కొయ్యలకోసం
తిరుగుటమాని పెరట పాదులు - దిద్ది చక్కగ పెంచాలో ||
[లమ్మో చిట్టెమ్మ ||

### పురుషులు.

చింకిగోచీ చించివేసి - చెంగుపంచ కట్టుకొని
ముడికి పాతముక్కలు చేసి - తెల్లని వేష్టితలకుచుట్టి
తక్కిన కులములందరివలెనే - తక్కుచు మనము తిరిగాలో || ర ||

స్త్రీలు.

మేనినిండ చీరకట్టి-మెడలనిండ రవిక తొడిగి
చింపిరి జుట్టులు దువ్వుకొని-సొంపుగ పువ్వులు ముడుచుకొని
గోపకన్నెల లాగన మనము - గోటుమీరగనుండాలో ॥ ౧ ॥

బాలురు.

పలకపుల్ల చేతనుబట్టి - పాఠ పుస్తకములు పట్టి
నిన్నటి పాఠం నేర్పుగ చదివి - రేపటి పాఠం చూచుకొని
బడికి పోవాలింక మనము - పందులుకాయం బోవద్దో ॥ ౧ ॥

బాలికలు.

కోలాటములనాడవాలి - పూలు బొమ్మ లల్లవాలి
ఏల పాటలు పాడవాలి - లీల చదువులు చదువవాలి
పేడ తట్టల నెత్తిని బట్టి - వెంటలంట తిరగొద్దో ॥ ౧ ॥

పురుషులు.

ఉత్తరమున మంచుకొండ - దక్షిణమున కన్నె కుమారి
తూర్పు పడమరల సముద్రం - తోను వెలిగే భారతభూమి
మనది యంచుతలచుకుంటే - మనసు లేచొస్తాదిరో ॥ ౧ ॥

స్త్రీలు.

పారులు వెలసిన పావనభూమి - రాజులేలిన రమ్యభూమి
వైశ్యులు వరలిన భాగ్యభూమి - కాపులమరినకమ్మపు భూమి
మనదియంచు తలచుకుంటే - మనసు లేచొస్తాదే వో ॥ ౧ ॥

పురుషులు.

మనకెల్లరి కిది జన్మభూమి - మంచి బువ్వపెట్టే భూమి
మరియాదలు తెచ్చే భూమి - మహిమలు విద్యలు నేర్పే భూమి
మనదియంచు తలచుకుంటే - మనసు లేచొస్తాదిరో ॥ ౧ ॥

స్త్రీలు.

లచ్చిమి తల్లి వెలసిన భూమి - చమవులు పెక్కు జరిగే భూమి
పచ్చని పైరు లలరినభూమి - పాడి పంట చెలగెడి భూమి
మనదియంచు తలచుకొంటే - మనసు లేవొస్తాదే వో ॥ ల

పురుషులు.

వ్యవసాయము బాగా చెయ్యాలి - పరిశ్రమలు పలుసాగించాలి
వర్తకము హెచ్చించాలి - శాస్త్రిపద్ధతి జరిపించాలి
ప్రజా ప్రభుత్వపద్ధతిదీన - ప్రబలునట్లు చెయ్యాలో ॥ ర

స్త్రీలు.

గ్రామములే మన హిందూదేశపు - కలిమికి నెల్ల నెలవులని
కళలకు నెల్ల నిలయములని - పాటక జనుల ప్రాణములని
...దిలోనమ్మి మనమందరము - మరవక శ్రమపడవలయు నో ॥ ల

...ధారునుగాక !
...లునుగాక !

## 12. రామనామ మంత్రోపదేశము.

రామనామ మంత్రోపదేశమును + రమణ పొందుదము రారండి
పామరతను విడి పావనతనుగొని + ప్రాజ్ఞులమై చెలగుదమండి ॥ రా ॥

కామక్రోధాదుల హరియించెడి + ఘనమగు దివ్యౌషధమండి
నీమంబును నిష్ఠను బురికొల్పెడి + నిర్మలమగు తీర్థంబండి ॥ రా ॥

వాల్మీకిని కవివరుని చేసిన + బ్రహ్మానందామృతమండి
తులసీదాసును భువిపై పార్చిన + తుందిలమగు వాహినియండి ॥ రా ॥

కష్టుల నిష్ఠుల కాపుల బాపల + కడుదగ తీర్చెడి జలయండి
భ్రష్టులకును పరిపక్వము గూర్చెడి + పావనమగు బిందువుసుండి ॥ రా ॥

విసుగునుపొందిన వారికి నెల్లను + విశ్రాంతిని నిడుతావండి
పసిమీరగ నూతన యత్నంబుల + సాధించే సాధనమండి ॥ రా ॥

శత్రువులను మిత్రులుగా మా [illegible] న్నోపాయంబు [illegible]
క్షేత్ర క్షేత్రమునందున వె [illegible]
భక్తులందఱును పా [illegible]

ఓం

# జమీందారీ రైతు సమస్య



1933

 [ వెల 0-4-0

# పీఠిక

జమీందారీసమస్య భారతసమస్యలలో అగ్రగణ్యమైనది. ఇందునుగూర్చి ఆంధ్రభాషలో సప్రమాణమైన గ్రంథములు లేనందున ఈచిన్నిపొత్తమునకై ఉద్యమింపబడినది. దీనిప్రారంభము ఈగ్రంథకర్తచే కడలూరుజైలులో చేయబడినది. ఈగ్రంథము వ్రాయుటలో గ్రంథకర్తను నిరంతరముప్రోత్సహించుచు పడుచువాడైనను, ముసలివానిశాంతముతో కూర్చునివ్రాసి, సహకారమునుచేసిన జైలుసహాధ్యాయి, ప్రసిద్ధ పర్లాకిమిడి జమీందారీరయితుబిడ్డ, శ్రీ. డి. సూర్యనారాయణరెడ్డిగారు కృషీవలులసేవకొరకు దీర్ఘాయుర్దాయవంతుడగుగాకయని పరమేశ్వరుని ఈగ్రంథకర్త కోరుచున్నాడు. గ్రంథముయొక్క మంచిచెడ్డలు పాఠకమహాశయులే నిర్ణయించుకొనెదరుగాక. గ్రంథవిజయము రయితుసామాన్యములో గ్రంథాంశములుపొందు వ్యాప్తిపైననేగలదని గ్రంథకర్త నమ్మిక.

కొవ్వూరు
గౌతమీతీరము
శ్రీముఖసం॥ర చైత్ర బ ౧౨ శుక్రవారం
( ది 21—4—1933. )

ఇట్లు
గ్రంథకారుడు.

# సమర్పణము

నాపదమూడవ యేటనే తెనుగు యెస్టేటుల్యాండుచట్టమును వాచకముగా చదివించి, జమీందారీరైతు సమస్యనుగూర్చి మనస్సీమలో అంకురార్పణముచేసినట్టియు; అమాత్యులయ్యు హాలవృత్తి దక్షులున్న హాలికజనోద్ధరణ తత్పరులైనట్టియు స్వీయప్రతిభవలననే ధర్మచింతను వీడని దిగ్విజయమైన జీవితముతో సహస్రమాసజీవియై నిశ్చలమనస్సుతో పరమపదించినట్టియు—మా నాన్నగారు వెంకట్రామయామాత్యులవారి జ్ఞాపకార్థము.

రె. మం. శ.

1

# జమీందారీ రైతు సమస్య: దాని ప్రాముఖ్యత.

## 1 వ అధ్యాయము

భారతదేశములో గల వ్యవసాయిక భూమిలో సగముకంటె పైభాగము జమీందారీలకు చెందియున్నది. గ్రామపంచాయితీ మొదలు ఢిల్లీ అసంబ్లీ వరకును గల శాసనసభలయొక్క ఓటర్లలో అధికసంఖ్యాకులు జమీందారీలలో యున్నారు. దేశపుటార్థికసంపత్కరములైన నదులు, వాగులు, అడవులు, గనులు మున్నగునవి కూడ ఇచ్చటనే అధికముగా నున్నవి. కాని దేశముయొక్క అజ్ఞానమునకును దారిద్ర్యదాస్యములకును కూడ యీ జమీందారులే గర్భగుళ్లు. ప్రపంచములోని అమెరికా, యింగ్లండు, ఆష్ట్రేలియా మున్నగు దేశములలోని రైతులు సమృద్ధిగా కూడును గుడ్డయు గలిగి రోజునకు రు 3-0-0 లకు తక్కువకాని ఆదాయముతో సుఖజీవనమును చేయుచుండగా సర్వఖనిజములకు నిధియై సర్వ సస్యములకున్ను అనుకూలమై అనేకమహానదులచే విరాజిల్లుచు రత్నగర్భయని ప్రసిద్ధిగాంచిన యీ భారతదేశములోని రైతుయొక్క రోజువారీ సగటు ఆదాయము రు 0-0 9 లు మాత్రమే.

రైతువారీ గ్రామములోని రైతులకంటె జమీందారీ రైతులు కడు పేదవారు, కడు దీనులు, కడు విద్యావిహీనులు. దేశముయొక్క ఆహారోత్పత్తికిని, ఆర్థికసంపదలకును మూలమైన కోట్లకొలది యీ జమీందారీ రైతులు యిట్టి దీనస్థితిలో యున్నంతకాలము దేశమున శాంతిగాని సౌఖ్యముగాని నిజమైన స్వరాజ్యముగాని ప్రవర్తిల్లుటకు

వీలులేదు. దేశసంపదకు మూలకందమైన రైతు సుఖమునకు గాని రాజ్యము స్వరాజ్యమా?

నేడు ప్రతిభారతీయుడును యీ జాతీయదృక్పథమునుండి జమీందారీరైతు సమస్యను వీక్షించి శోధించి పరిష్కరింపవలసి యున్నది. వ్యక్తులను మరచి దేశక్షేమదృష్టితోడను, ధర్మవ్యవస్థను నిర్ణయించు భావముతోడను పరిష్కరింప నీ సమస్య భారతప్రజాళి వైపు అత్యాతురతతో నిరీక్షించుచున్నది.

ఈరైతు దుస్థితికి కారణమేమి? దానిని నివారించుటకు మార్గమేమి? ఈప్రశ్నలకు సమాధానము తెలుసుకొనుటకు ముందు యీ జమీందారీ పద్ధతియొక్క చరిత్ర కొంచెము తెలుసుకొనుట యుచితము.

---

# పెర్మనెంటు సెటల్‌మెంటుయొక్క పద్ధతి.

బ్రిటిషువారు యీ జమీందారులను ఎట్లు సృజించిరి?

బ్రిటీషువారు వర్తకము నిమిత్తమై 1600 క్రీ. శ. ఆఖరున వచ్చి క్రమముగా రాజ్యసంపాదనకు గడంగిన సంగతి ఎల్లరకు తెలిసినదే. వీరి స్వాధీనమునకు వచ్చిన భూములు ఆకాలమున నాలుగువిధములుగా నుండినవి.

(1) పూర్వపు మూర్ధాభిషిక్తులైన రాజుల వంశములవా[illegible] రాజ్యములు లేక జమీలు.

(2) పూర్వ మహమ్మదీయుల రాజ్యములలోని రివిన్యూ యుద్యోగస్తులకు యియ్యబడిన జాగీరులు.

(3) సేన వగైరాలను పోషించుటకు ఏర్పడిన హావేలీ (Havali) భూములు.

(4) ఇజారాదారులు, గుత్తదారుల క్రిందనున్న భూములు. బ్రిటిషువారు తాము క్రొత్తగా సంపాదించిన రాజ్యమును స్థిరపరచుకొనవలెనను నుద్దేశ్యముతో యుండిరి. మరియు భూమిదున్నెడు రైతునకు యీ దేశములో చిరకాలమునుండియు గల హక్కులను గాని నాతని ఆర్థికక్షేమమునుగాని అప్పటి బ్రిటిషువారి విధానములో ప్రధానలక్ష్యముగా (Main objects) పెట్టుకొని యుండలేదు.

మరియు "భూస్వామ్యము (Proprietorship) రాజుది." అను ఆంగ్లేయ సాంప్రదాయమునకు సంబంధించినవా రగుటచే ఆంగ్లేయులు తాము అవలంబింపబోవు విధానమువల్ల భారతదేశముయొక్క ప్రాచీన సాంప్రదాయమును ఆర్థిక విధానమును తల్లక్రిందులు చేయుచుంటిమని అప్పుడు వారికి గోచరించలేదు. వారు అప్పటిలో అవలంబించిన పెర్మనెంటు సెటిల్‌మెంటు విధానము.

(1769-1802) భూములను ముఠాలుగా విభజించి వేలము వేసిరి. ఆవేలములో వాటిని క్రయముపొందినవారికి జమీందారులని పేరు పెట్టిరి.

కొన్ని జమీందారీలు సేనలో నౌఖరీ చేయుటకు బ్రిటిషువారికి పూర్వపు రాజులవల్ల యివ్వబడినవి.

పైచెప్పిన ప్రకారం పూర్వపురాజ్య వంశమునకు చెందిన జమీందారులకున్ను సైనిక సహాయంచేయు షరతుపైని అనుభవించుచున్న (Military tenure) జమీందారులకున్ను వేలములో ముఠాలను క్రయము పొందినవారికిన్ని 1779 వ సం॥ బంగాళదేశములోను 1802 వ సం॥ మదరాసు రాజధానిలోని నీక్రింది నిబంధన ప్రకారము శాశ్వతపుసిస్తు పద్ధతి నేర్పర్చిరి.

(1) వీరందరును బ్రిటిషుప్రభుత్వము పట్ల రాజభక్తి గలిగి యుండవలెను.

(2) వీరికి యిదివరకుగల సివిల్, క్రిమినల్, మిలటరీ హక్కు హోదాలను వదులుకొనవలెను. (గౌరవార్థమునకు కొన్నిచోట్ల బ్రిటిషువారి అనుమతి పైని కొద్ది సిబ్బంది ఉంచుకొన వచ్చును.)

(3) గ్రామములోని వచ్చు బడిపన్ను (Income tax) యిండ్లపన్ను (House tax) రహదారీపన్ను (Toll tax) మున్నగు భూమి కంటె ఇతరమైన పన్నులు బ్రిటిషువారికి వదలివేయవలెను.

(4) అంతకు పూర్వము పదమూడు సంవత్సరముల దామాషాయ పంట ధరలనుబట్టి భూమియొక్క ఆదాయములో సగభాగము రయితులు పొందునట్లును మిగతా సగములో 2/3 వ వంతు జమీందారు, ప్రభుత్వమునకు చెల్లించునట్లును 1/3 వ వంతు ప్రభుత్వపు టాదాయమును వసూలు చేసినందులకు జమీందారునకు చెందునట్లు ఏర్పర్చి, జమీందారు ప్రభుత్వమునకు చెల్లించు సిస్తు ఆచంద్రార్కముగా స్థిరము చేసిరి (Permanent settlement).

(5) అప్పటికి గ్రామములోని బంజరు (Waste) పోరంబోకు (Unreclaimed) భూమి అంతయు సాగులోనికి తెచ్చుకొని జమీందారు లందలి ఫలములో గవర్నమెంటుకు నేమియు చెల్లించనక్కరలేకయే తానే ప్రత్యేకము అనుభవింప వచ్చును.

(6) అప్పటికే యుండిన ధర్మచెర్వులు, మందబయళ్లు, కళ్ళములు, రుద్రభూములు, పుంతలు మున్నగు సాముదాయక భూములలో (Communal lands) జమీందారునకు ఎట్టిజోక్యమును లేదు.*

(7) జమీందారునకు ఎస్టేటుపైగల హక్కు అమ్ముకొనుట

---

* దర్ఖాలా పట్టబడినవి నిరుపయోగ మైనప్పుడు జమీందారు యె. లా. సెక్షను ప్రకారము స్వాధీనపర్చుకోవలెను.

మొదలైన అన్యాక్రాంతములు జరిగించుకొనుటకు అధికార మీయ బడినది. యీాషరతులతో జమీాందారు "సనద్" అను పేరుతో ఒక పత్రమును ప్రభుత్వమువారికి వ్రాసి యివ్వవలెను. "కబూలియత్" అను పేరుతో ఒక పత్రము జమీాందారునకు వ్రాసి యిత్తురు. యీా పత్రములో "ఎంతకాలము రైతుయొక్క క్షేమము నాక్షేమముగా ఎంచుకొనెదనో అంతకాలము యీా శాశ్వతపు పన్ను పద్ధతియొక్క లాభమును పొందగలుగుదును" అను షరతుకూడ యున్నదని పాఠకులు మరువకుందురు గాక!

యీా విధముగా కొందరు వ్యక్తులను బ్రిటీషువారు సృష్టించి వారికి జమీాందారు అనే హోదాను కల్పించి కోట్లకొలది రైతాంగము యొక్క క్షేమమును వారి చేతులలో పెట్టిరి. మరియు నిందువలన పూర్వ రాజవంశస్థులైన స్వల్ప సంఖ్యాకులైన జమీాందారులు తమ హోదాలను కోలుపోయిరి. సామాన్య వ్యక్తులు అనేకులు యీా హోదాలోనికి వచ్చిరి.

---

## పిమ్మట శాసనములు 1802-1871.

యీా శాశ్వతశిస్తు పద్ధతి (Permanent settlement) 1802 సం॥ 25 వ రెగ్యులేషన్ క్రింద జరిగినది. పిమ్మట జారీచేయబడిన 1802 సం॥ ప్ర॥ 28, 29, 30 రెగ్యులేషనులు :— రెగ్యులేషను 28 క్రింద జమీాందారు రైతుతో శిస్తునుగూర్చి "గింజలలో గాని నగదులోగాని" (In kind or cash) స్పష్టమైన ఏర్పాటు చేసుకొనవలెననియు అందునుగూర్చి రైతునకు పట్టా యివ్వవలెననియు రైతు శిస్తునిమిత్తము

అతని చరాస్తి జప్తుచేయడమే కాకుండా భూమినుండి తొలగించుట కున్ను (కాని తాను స్వాధీనము చేసుకొనరాదు) జమీందారునకు అధికారమివ్వబడినది. 29 వ రిగ్యులేషను :—జమీందారీ గ్రామము లోని కరణమునకు సంబంధించినది. కరణము గ్రామములోని పంట అంచనా లెఖ్ఖలను తయారు చేయవలెననియు సకల పంట సంపకము సమయములలో తానుకూడ దగ్గర ఉండవలెననియు గ్రామములోని సాముదాయికభూములు (communal lands) లెక్కలలో స్పష్టపరుప వలెననియు మొదలైన విందుగలవు. 30 వ రిగ్యులేషను :—పట్టా ముచ్చలుకాలు జమీందారు రైతులు యిచ్చి పుచ్చుకోవలెననియు సదరు యొడంబడిక ప్రకారము ఏర్పడిన శిస్తుతప్ప అదనముగా ఎట్టి పన్నును జమీందారు వసూలు చేయరాదనియు యీ శిస్తును గురిం వివాదవచ్చినపుడు సివిల్ కోర్టువారు పర్మనెంటు సెటల్ మెంటు పూర్వపు సంవత్సరములో ప్రక్కభూముల సిస్తునుబట్టి గాని ఆచారము బట్టి గాని తీర్పుచెప్పవలెననియు కలదు.

పిమ్మట వచ్చిన 1822 సంవత్సరము 4-5 నెంబరులక్రింద చేయు బడిన చట్టములు :—

ఇవి రైతులయొక్క హక్కులను నిర్వహించుటకు ప్రయత్నిం చినవిగాని జమీందారు తనహక్కులను చలాయించుటకై నిర్దేశింప బడినంత స్పష్టవిధానమువలె రయితు తనహక్కులను భద్రపర్చుకొను టకు వీనియందు విధానము నిర్ణయింపబడలేదు.

---

# 1865 సం॥ 8 వ చట్టము (Rent recovery Act)

దీనిక్రింద యిదివరకు పుట్టబడిన రెగ్యులేషనులలోని అంశము లన్నియు యేకశాసనరూపకముగా పొందుపరచబడినవి. (Consolidated) కాని 1802 మొదలుకొని యిప్పటివరకు అనగా 1865 వరకు ను జమీందారులు రైతుయొక్క క్షేమమును న్యాయసమ్మతముగా పరిపాలించుచున్నారా లేదా అను అంశమును ప్రభుత్వమువారు గమ నింపలేదు. అందుచే జమీందారుల నిరంకుశత్వము హెచ్చినది. యి కాక 1865-70 సం॥ ఆ ప్రాంతములలో జమీందారు-రైతులహక్కు బాధ్యతలను గుర్తెరింగి యుండిన అప్పటి రాజధానికోర్టు (Presidenc Court) "సదర్ అదాలత్" రద్దు అగుటయు దాని స్థానే ప్రస్తు (High Court) హైకోర్టు నిర్మింపబడుటయు తటస్థించెను. యీన తన న్యాయాధిపతులకు వీరిపూర్వపు సాదర్ అదలత్ కోర్టువారి కు డిన అనుభవము విషయపరిచయము లేదు. పైగా వీరు రైతు, భూస్వ మి (Land lord and tenant) అను పదమునకు ఆంగ్లేయన్యాయ శాస్త్రము ప్రకారము అర్థమును చెప్పజొచ్చిరి. అనగా హిందూదే శ ములోని రైతునకు అనాదిగా భూమిలో హక్కుగలదను సాంప్రదా యమును యీ నూతన న్యాయస్థానమువారు మరచిరి. అందుచే 1871 సం॥లో చోకలింగంపిళ్లే కేసులో వీరు తీర్పు చెప్పుచు "రైతును స్వాధీ నా హామినుండి తప్పించుటకు జమీందారునకు అధికారము గలదని కు అభిప్రాయమిచ్చిరి. ఇట్టి అభిప్రాయమిచ్చుటలో 1802 సం॥పు 25 వ రిగ్యులేషనులో "రైతును తొలగించవచ్చును" అను వాక్యము ను జమీందారు స్వాధీనపరచుకొనవచ్చునను అపార్థమును చేసినట్లు కన బడుచున్నది. వెంటనే యీ అవకాశము పుచ్చుకొని రైతు ను

హెచ్చు శిస్తు కట్టుకొనవలెననియు అట్లుల కట్టుకొననివారు భూమి నుండి తొలగించబడుదురనియు బెదరించి జమీందార్లు శిస్తులను అనేక రెట్లు నిరంకుశముగా హెచ్చించిరి. తనవంశపరంపరనైన వృత్తినిగాని, చిరకాలమునుండి యుండిన తనభూమిని గాని వదలుకొనుటకు రైతు అంగీకరించనివాడగుటచే యీాపన్నుల భారముతో క్రుంగిపోవుటకు నిశ్చయించుకొనెను.

---

## 2 వ అధ్యాయము

**1871-1908:**—1871 సంవత్సరము మొదలుకొని జమీందారీ రయితులయొక్క హక్కులను క్షేమమును కాపాడవలెనని ప్రభుత్వ సభ్యులలో కొందరు యోచించుచుండిరి. పైన తెలుపబడిన "చోకలింగంపిళ్లే" తీర్పు దేశముయొక్క న్యాయసూత్రములకున్ను రైతు క్షేమమునకున్ను విరుద్ధమని వారు తెలుసుకొనిరి. విద్యాగంధము లేక నిరుపేదయయి సంఘశక్తి లేని జమీందారీ రయితును పెర్మనెంటు సెటిల్మెంటు నాటినుండియు జమీందారులెట్లు పీడించుచున్నదియు, యీా చోకలింగంపిళ్ళే తీర్పు వీరొనరించు పీడనకు శాసనసహాయము నెట్లిచ్చినదియు వారు గమనించుచుండిరి. దీనివలన జమీందారీలలోని ప్రజలయొక్క ఆర్థికస్థితి కడు దైన్యతలోనికి వచ్చుట కూడ సంభవించినది. దీనిని నివారించుటకు 1882 సంవత్సరములో సర్ ఫిలిఫ్ హచ్చిన్సు గారిచే ఒకబిల్లు (A Bill for right of occupancy to the ryot) ప్రతిపాదింపబడి యుపసంహరింపబడినది. తిరిగి 1884 వ సంవత్సరములో యీా విషయమై అనేక చిత్తులు (drafts) "కార్మికేలు" గారి బిల్లు,పిమ్మట 1902సం॥ లోనున్న

1905 లోను 1906 లోను యీ విషయమై మరికొన్ని బిల్లులు ప్రవేశ పెట్టి ఉపసంహరించుకొనబడినవి.

నేడు అమలులోనున్న 1908 వ సం॥ ఎస్టేటు ల్యాండుచట్టము నకు పునాది యైన ఒకబిల్లు అప్పుడు మదరాసు ప్రభుత్వ (Home member) అయిన ఫోర్బ్సు(Forbes) గారిచే ప్రతిపాదింప బడినది. యీ యన రయితుయొక్క ధర్మసమ్మతమైన హక్కులను కాపాడుటకు మిక్కిలి కృషి సలిపెను. కాని అప్పటి శాసనసభలు పూర్ణముగా జమీందారుల పలుకుబడితో నిండి యుండుటచేతను దీనులైన రయితుల యొక్క కృతజ్ఞతకంటె ప్రబలులైన జమీందారులను సంతృప్తి పరచు టయే ప్రభుత్వమువారి రాజనీతి అయి యుండుటం బట్టియు రైతునకు పరిపూర్ణ న్యాయము జరుగలేదు.

---

# 1908 వ సంవత్సరము 1 నెంబరు చట్టములోని అంశములు:



(a) సెక్షను 1-23 :—భూమిని గురించి రైతునకు జమీం దారునకుగల హక్కు బాధ్యతలు.

(1) రైతునకు చిర పరంపరగా భూమియందున్న సాగుహక్కు స్థిరము చేయబడినది. కాని పాతబంజరు (old waste) (Home farm) స్వంతసేరీ, ఇతర పద్ధతులక్రింద కొంతభూమిని సాగుహక్కు తీసి వేసి తిరిగి జమీందారుయొక్క నిరంకుశపు హక్కులకు లోనుచేసినవి.

(2) చట్టమునకు పూర్వము భూమిలోయున్న చెట్లను రైతు, జమీందారునివి అని ముచ్చిల్కాలో ఒప్పుకొన్నయెడల జమీందారు నవనియు చట్టమునకు దరిమిలావి రైతునవనియు నిర్ణయించబడినది.

(3) గనులు త్రవ్వుకొను హక్కుకూడ జమీందారునకు యివ్వ బడినది.

(4) సాముదాయక భూములు (communal lands) సదరు ప్రజోపయోగమునకు నుపయోగించనప్పుడు సదరు ప్రదేశములు 1802 సం॥ దరిమిలాను జమీందారు యిచ్చినవైన యెడల కలెక్టరు (collector) యొక్క అనుమతితో జమీందారు వశపరచుకొనవచ్చును. కాని జమీందారు యిచ్చిన చెరువు పడకలు (Tank beds) ఎల్లప్పుడును జమీందారుని వశములోనే యుంచబడినవి. 1802 వ సం॥ పూర్వమునుంచి యుండిన సాముదాయకభూములతో జమీందారునకు ఎప్పుడున్ను ఎట్టిసంబంధములేదు.

(5) ఒకభూమి రైతీభూమియా (A land with right of occupancy) లేక శేరీభూమియా అను వివాదగల్గినప్పుడు ప్రథమతః ఎస్టేటులలోని ప్రతిభూమియు "రైతీ" భూమియను యూహ (presumption) పైన కోర్టువారు విచారణ ప్రారంభించవలెను. ఒకసారి రైతీహక్కు పొందినభూమి సదరు రైతులు మారినను భూమి రైతీ (Ryothy character) స్వభావము మారదు.

(b) సెక్షనులు (24—49) శిస్తులను గురించి:—

యీ భాగములో శిస్తులు హెచ్చించుట తగ్గించుటకు గింజలరూపకముగా యున్న శిస్తు నగదురూపకముగా మార్చుటకు, భూమి మార్పుదలబట్టి శిస్తుమార్పుదల చేయుటకు సూత్రములు (principles)న్ను విధానమున్ను (procedure) తెలుపబడినది. యీ చట్టమునకు అనంతరము రైతుపై శిస్తును ఒడంబడిక మూలముగా హెచ్చుచేయుటకు వీలులేదు. గింజలుధరలు పెరిగినవను కారణముచేతను జమీందారు భూమికి అభివృద్ధి కరమైన పనులు చేయించెననియు ప్రభుత్వమువారు చేయించిన అభివృద్ధిపనుల (Im-

provements) వలన జమీందారీలోని రైతుభూమియొక్క కిమ్మతు హెచ్చినదనియు నదీప్రవాహమువలన ఒండ్రు Fluvial action భూమిలో మేటవేసినదనియు—యీ కారణములవలన కలెక్టరువద్ద దావా చేసి తద్వారా శిస్తులలో హెచ్చు చేయవలెను. శిస్తు హెచ్చుదలను దావాలోగాని, శిస్తులేనిచోట శిస్తు విధించుటకుగాని ఉన్నశిస్తును గూర్చి వివాదలు వచ్చినప్పుడుగాని సదరు భూమిపైనను ప్రక్కభూములపైనను అప్పటికి ఉన్నశిస్తు సబబుఅయినదని న్యాయాధికారి యూహించవలయును. (Presumption) శిస్తు తగ్గింపు ఉభయాంగీకారముపైనను చేసుకొనవచ్చును (Reduction by contract). లేక రైతు గింజల ధరలు తగ్గిపోయినవను కారణముచేతను భూమి స్థిరముగా నిస్సారమైనదను కారణముచేతను జమీందారుపై దావాచేసి పరిహారము పొందవచ్చును. సాగుహక్కులేని యితరభూములలో జమీందారు హెచ్చుశిస్తు కట్టుకొనని రైతును ఆభూమినుండి తొలగించవచ్చును.

(c) శెక్షనులు 51-58 పట్టాముచ్చలికాల మార్పుదలకు సంబంధించినవి :—పట్టాముచ్చలికాలలో జమీందారు రైతు ఏర్పరచుకొన్న షరతులు స్పష్టముగా ఉదహరింపబడవలెను. పట్టాముచ్చలకాలు లేనిదే జమీందారునకు 77 శెక్షను క్రింద రైతుయొక్క చరాస్తిని జప్తుచేయుటకు హక్కులేదు. రైతు ముచ్చలికాలు యిచ్చుటకున్ను జమీందారు పట్టాయిచ్చుటకున్ను నిరాకరించినయెడల రివిన్యూకోర్టుద్వారా చర్యజరిపి పరిహారమును పొందవచ్చును.

(d) సెక్షనులు 59-72 శిస్తుచెల్లించుటకు సంబంధించినవి :—తాను పుచ్చుకొన్న సిస్తునకు జమీందారు రశీదుయివ్వని యెడల రైతు కోర్టుద్వారా దానిని పొందవచ్చును. కొన్ని పరిస్థితులలో రైతు శిస్తును కలెక్టరువద్ద డిపాజిటు చేయవచ్చును.

(e) సెక్షనులు 73-76 గింజలరూపకముగా శిస్తు చెల్లించేడు స్థలములో జరుగవలసిన విధానము:—పంటను అంచనా పద్ధతిపైనను (appraisement) గాని రాశిమీాదగాని పంపకము చేసుకునే స్థలములందు సదరు పంట అంచనాను గురించిగాని పంటయొక్క పరిమితిని గురించిగాని దానియొక్క పంపకమును గురించిగాని జమీాందారునకు రైతునకు వివాదవచ్చినపుడు కలెక్టరు ఒక రివిన్యూ ఉద్యోగిని పంపుచు కక్షిదారులు నిర్ణయించుకొన్న మనిషి (Assessor) సహాయముతో యిందునుగూర్చి సదరు ఆఫీసరు మామూాలును బట్టి తీర్పు చెప్పును. సదరు తీర్పుపైన తీర్పు తేదీనుండి వారములోగా కలెక్టరుకు అప్పీలు చేయుటకు హక్కు గలదు.

(f) సెక్షనులు 77—134 శిస్తు బాకీని గురించి రయితుయొక్క చరాస్తిని స్థిరాస్తిని జప్తు వేలము వేయించుటకు విధానము:— యీా చరాస్తి జప్తుహక్కు గవర్నమెంటు జిరాయితీ రైతులకున్న ఈనాముదారులకున్న వారి క్రింద రైతులపైన (సదరు రైతువలన వ్రాతమూలకమైన కవులు పొందినయెడల) గలవు.

(g) 135—142 జలాధారముల మరామత్తు:—ఒక జలాధారము క్రిందయున్న ఆయికట్టులో నాల్గవవంతు భూమి గల రైతుగాని (లేక) సదరు ఆయికట్టుపైన చెల్లే శిస్తులో నాల్గవవంతు చెల్లించే రయితులు గాని సదరు జలాధారము మరామత్తు కోరుచున్నదనియు, యిందునుగూర్చి తాము తెలిపియుండి నప్పటికి జమీాందారు నిర్లక్ష్యము చేసెననియు అందువల్ల తమ పంటకు నష్టము కలుగుచున్నదనియు తాము జిల్లాకలెక్టరుకు అర్జీపెట్టుకొనవలయును. అందుపైన కలెక్టరు విచారణచేసి సదరు జలాధారము మరమ్మత్తు కోరుచున్నదనియు జమీాందారు దానిని మరమ్మత్తు చేయించవలసియుండియు చేయించలేదనియు నిర్ణయించిన పిమ్మట జమిందారునకు కొంత గడువిచ్చి ఆగడువులోపుగా

దానిని మరమ్మత్తు చేయించవలెనని సదరు కలెక్టరు తెలియపర్చును. ఆప్రకారం జమిందారు చేయనియడల సదరు రైతులే ఆమరమ్మత్తు తమ ధనముతో చేసుకొనవచ్చును. పిమ్మట సదరుపని కలెక్టరు తనిఖీ చేసి రైతు ఖర్చుపెట్టిన సొమ్ము సరియైనదని స్థిరపరచి దానిని రాబట్టుకొనుటకు ఉత్తరవు యిప్పించవచ్చును. సదరు పెట్టుబడిసొమ్ము బాకీ తీరువర్కు సదరు ఆయకట్టుక్రింద రైతులు జమిందారుకు చెల్లించే శిస్తులో మెరకరేటు మాత్రం జమిందారునకు చెల్లించునట్లున్ను మిగతాసొమ్ము (వడ్డీసహా) పెట్టుబడిదారు అయిన రైతు, లేక రైతులకు చెల్లించునట్లును కలెక్టరు వుత్తరవు యిచ్చును. యీ జలాధారములు గవర్నమెంటుకు జమిందారునకు జాయింటు హక్కుగా యుండేటి స్థలములలో గవర్నమెంటే సదరు మరమ్మత్తు చేయించి సదరు పెట్టుబడిలో జమిందారు యివ్వవలసిన భాగము (arrears of land revenue) క్రిందగవర్నమెంటు రాబట్టుకొనెదరు.

(H) సెక్షనులు 145-148 భూవిభాగము పట్టామార్పుదల.

పల్లములో ఎకరమునకు లోపుగను, మెరకలో ఐదుఎకరములకు లోపుగను (Sub-division) చేయుటకు వీలులేదు. దీనికి మించిరైతు యొక్క భూమిలో చేయబడిన క్రియముగాని యితర అన్యాక్రాంతములుగాని జరిగినప్పుడు జమీందారు అభ్యంతరపెట్టుటకు వీలులేదు. ఆవిధముగానే అవి భాజ్యపుజమీలు తప్ప (Impartible Estate) మిగతా జమీందారీలు పూర్తిగా గాని కొంతభాగముగాని అన్యాక్రాంతముచేయవచ్చును. కాని అట్టి అన్యాక్రాంతము జరిగించిన వెంటనే రైతు వ్రాతమూలకమైన నోటీసును జమీందారునకు సదరు అన్యాక్రాంతము గూర్చి పంపవలెను. అందుపైని సదరు నోటీసు యివ్వబడిన సంవత్సరిముకంటే పై॥సం॥నుంచి సదరు అన్యాక్రాంతము (Transfer) పొందినవానితో జమిందారు పట్టాముచ్చిల్కాలు మార్పుచేసుకోవ

లెను ఆలా జమిందారు చేయనియెడల అందునుగూర్చి రైతు కలెక్టరు కు అర్జీయిచ్చుకోవలెను. పైన తెలుపబడిన పరిమితికి లోబడి రైతు తనకు అక్కరలేని భూమి విడుదల యివ్వవచ్చును. యీ చట్టములోని కొన్నినిబంధనలకు లోబడి జమీందారు రైతును భూమినుండి తొల గింపవచ్చును.

(I) సెక్షనులు. 149-163 రైతు భూమిని విడుదల యిచ్చు టకున్నూ రైతును ఏ పరిస్థితులలో భూమినుంచి జమీందారు తొల గింపవచ్చునో తెలిపెడి భాగము.

(K) 164-180 (సర్వేరికార్డు ఆఫ్‌రైట్సు) (Survey record of Rights and Settlement of rents) (ప్రభుత్వమువారు జమీం దారుయొక్కయు రైతులయొక్క అనుమతితో గాని లేక నాల్గవవంతు నకు తక్కువ కాని రైతులు కోరికపైనగాని సర్వేరికార్డు ఆఫ్‌రైట్సు న్ను రివిన్యూవారిద్వారా ఒక ఎస్టేటులోగాని ఎస్టేటుయొక్క భాగము లోగాని జరపవచ్చును. దరఖాస్తుతో కొంతసొమ్ము డిపాజిట్టుగా కట్ట వలెను. అందుపైన స్థానికప్రభుత్వమువారు అట్టిది అవుసరమని తోచి నయడల అట్లు చేయించబడునని గజెటుద్వారా ఉత్తరువు పంపించెదరు. సర్వే 1897 సం॥ సర్వేచట్టము ప్రకారము జరుపబడును. పిమ్మట యీ క్రింది అంశములగురించి ప్రతిరైతునకున్ను ఒక హక్కుల రిజిష్ట రును (record of Rights) తయారు చేయవలసినదిగా స్థానికప్రభు త్వమువారు ఉత్తరువు చేసెదరు:—

a (1) రైతుయొక్క ఎస్టేటు లేక జమీందారీ పేరు.

(2) రైతుయొక్క పేరు, ఆక్యుపెన్సీరైతా? లేక నానాక్యు పెన్సీ రైతా?

(3) పరిమితి (area) దానిహద్దులు.

(4) సదరుభూమి పల్లపుసాగా? మెరకసాగా? పల్లపుసా

గైనయెడల ఒకభాగమా? లేక రెండుభాగములా? లేక తోట భూమియా?

(5) రైతు సదరుహక్కుల రిజష్టరు నాటికి లా ప్రకారము చెల్లింపవలసిన శిస్తు సదరుశిస్తు స్థిరమైనదా (under section 30 clause 1 Proviso) (A)

(6) సదరుశిస్తు కోర్టుడిక్రీవల్లను గాని, సదరు ఎష్టేటు ల్యాండుచట్టముక్రింద గాని, లేక మరి ఏవిధమున నిర్ణయించబడినది?

(7) సదరు భూమికి ఉండబడిన యితరహక్కులు.

(ఉదాహరణ:—నీటికిదారి, భూమికి దారి వగైరా.)

(8) శిస్తు క్రమముగా హెచ్చించుటకు ఏర్పాటు యున్న యెడల దాని వివరములు. లేక జమీందారునకు రైతునకు ఉన్న ఒడంబడిక.

(9) సదరుభూమి, శిస్తులేని భూమి అయినయెడల సదరుశిస్తు ఎప్పుడైనా రైతు చెల్లించెనా లేదా? అలా శిస్తు చెల్లించనియెడల శిస్తులేకుండ భూమిని అనుభవించుటకు హక్కుయున్నదా? ఆహక్కుకు గల నిదర్శనము. శిస్తు చెల్లించదగిన భూమి అయినయెడల చెల్లించ వలసిన శిస్తు మొత్తము.

(10) సదరుభూమి పల్లపుభూమి అయినయెడల నీటి పారుదలకు సంబంధించిన హక్కులు.

b పై అంశముల గూర్చి స్థానిక ప్రభుత్వమువారిచే పంపబడిన ఉద్యోగి ఎష్టేటులో విచారణచేసి ఒక చిత్తురిపోర్టును ముందుగా ప్రచురించును. పిమ్మట అందుపైన పార్టీలు చెప్పుకునే అభ్యంతరములు విని, పిమ్మట (Final record of rights) ను ప్రచురించును. సదరు ప్రచురణ అయిన రెండునెలల లోపుగా అవసరమైనయెడల రైతులు గాని జమీందారు గాని కోరినయడల శిస్తు నిర్ణయమును కూడ

చేయవచ్చును. కాని యిట్లు చేయుటలో అప్పటికి ఉన్న శిస్తు సబ బయినది కాదని ఋజువు చేయవలసిన భారము రైతుపైన గలదు. రివిన్యూఉద్యోగి తాను చేసిన శిస్తు నిర్ణయమును అందుకు గల కారణము తెలుపు రిపోర్టుతో తనపైన నియమించబడిన (confirming.) అధికారికి తెలియపరచును. సదరు ఉద్యోగి అవుసరమైన సవరణలు చేయవచ్చును లేక దానిని తిరిగి విమర్శించవలశినదని క్రింది ఉద్యోగికి పంపవచ్చును. అది స్థిరపడిన వెనుక యీ శిస్తు నిర్ణయముకూడ రైతుయొక్క హక్కులపట్టీలో చేర్చబడును. యిది అంతయు తిరిగి ప్రచురింపబడును.

శిస్తు నిర్ణయముగూర్చి రెండు నెలలలోపుగా సదరు నిర్ణయము చేసిన అధికారియొక్క పై అధికారికి అనగా రివిన్యూబోర్డు (Revenue Board) వారు నిర్ణయించిన పై అధికారికి) అప్పీలు చేయవచ్చును.రివిన్యూబోర్డువారు సదరు రికార్డు ఆఫ్ రైట్సు (శిస్తునిర్ణయము సహా) ప్రచురింపబడిన రెండుసం॥ లోపుగా తమంతట తాముగానీ పార్టీల యొక్క ప్రార్ధనపైన గాని విచారణచేసి సదరు రికార్డు ఆఫ్ రైట్సులో మార్పుదల చేయవచ్చును. సదరు రికార్డు ఆఫ్ రైట్సు సర్వేప్లానుల ఖర్చును జమీందారు సగము రైతు సగము భరించవలెను. యీపద్ధతి క్రింద నిర్ణయింపబడ్డ శిస్తు ఇరువది సం॥ములలోపుగా ధరలు పెరిగినను కారణము వలనను ప్రవాహామువల్ల భూమి సారవంతమైనదను కారణములచేతను హెచ్చుచేయకూడదు.

(L) సెక్షనులు 180-215 భూస్వామి లేక జమీందారుయొక్క స్వంతభూమి (Private land) ఒడంబడికలు :—ఎస్టేటులోని ఒక భూమి జమిందారుని స్వంతభూమియా? కాదా అని ప్రశ్నవచ్చినపుడు యీ క్రింది అంశమును జమిందారు రుజువుపర్చవలెను. 1898 సం॥ జూలై 1 తేదీకి పూర్వము స్వంతభూమిగా (private land) దానిని

కవులు యిచ్చియుండవలెను. లేక యితరఆచారముగాని సాక్ష్యము గాని రుజువు చేయవలసిన భారము జమిందారునదై యున్నది.

(H) జమీందారునకు రైతుకు మధ్యను ఏట్టియొడంబడిక జరిగినను యీక్రిందివానిని సదరు ఒడంబడిక రద్దుచేయును.

(a) యీ చట్టము ప్రకారము రైతుతన భూమిలో మరామ్మత్తు చేసుకొనుటకు హక్కు.

(b) రైతునకు గల(occupancy) హక్కు ప్రకారము భూమిని బలపర్చుకొనుట అవకాశము. 38 సెక్షను ఎ. బి. క్లాజుల ప్రకారము శిస్తు తగ్గింపబోయునని దావా తెచ్చుటకు రైతునకుగల అధికారము:— (1908 వ సం॥ జనవరి తేదీకి పూర్వమే కొంతకాలమునకు ఏర్పాటు చేసుకొనబడిన భూములకు యిది వర్తింపదు.) 42 సెక్షను ప్రకారము భూమి మార్పువలనబట్టి సిస్తుకూడ మార్పుచేయుటకు రైతుకు గల హక్కు. గింజలరూపకముగా యున్న శిస్తును నగదురూపకముగా మార్చవలెననుటకు రైతునకుగల హక్కు. 149 ప్రకారము తనభూమిని విడుదలయిచ్చుటకు రైతుకు గలహక్కు. యీ చట్టములో చెప్పబడిన నిబంధనల ప్రకారము తప్ప అన్యవిధముగా రైతును జమీందారు తొలగించరాదను నియమము. రైతు గడబకాయి లేక బాకీనిగూర్చి చెల్లింపవలసిన వడ్డీవిషయమై యీ చట్టము 67 సెక్షనులో తెలుపబడిన నిబంధనలు విధానము.

జూరిస్‌డిక్షను ప్రొసీజరు (jurisdiction and procedure):- యీ ఎస్టేటుల్యాండు చట్టముక్రింద వచ్చే దావాలలో హక్కులకు సంబంధించిన దావాలు సాధారణముగా సివిల్ కోర్టులకున్ను మిగిలిన దావాలు రివిన్యూ కోర్టులకున్ను అధికారమియ్యబడినది. మరికొన్ని సందర్భములలో (Revenue Board) వారికి అధికారమీయబడెను. యీ చట్టము రైతుయొక్కయు జమిందారు యొ

క్కుయు హక్కు బాధ్యతలను స్పష్టపరచుచున్న దేగాక (Substantive Law) వానిని నమలుజరుపు విధానముతో (Adjectival Law) కూడియున్నది. యిది బంగాళాటెన్నెన్సీ చట్టముపైన ఆధారపడి యున్నది. యీ చట్టమునకు పూర్వముండిన రెంటురికవరీచట్టము ఇందువలన రద్దయినది. గ్రంధ విస్తరభీతివల్ల యీ విధానమును గూర్చిన శెక్షనులను తెలుపలేదు.

---

3 వ అధ్యాయము.

---

## సదరు చట్టము ఎంతవరకు దేశసౌభాగ్యము నకు మూలమైన జమిందారీ రైతాంగము యొక్క ఆర్ధికస్థితిని చక్కబరుచుట న్ను వారి న్యాయమైన హక్కుల ను కాపాడుటకు సహాయపడినది?

యీ చట్టమునకు పిమ్మట జమీందారువలన రైతు పొందెడు అక్రమములు నిరోధములు కోర్టులద్వారా నివారణచేసుకొనుటకున్న ఆ విధముగనే జమీందారులు తమకుగల హక్కులను కోర్టుద్వారా స్థాపించుకొనటకున్న అవకాశమియ్యబడినది. కాని నిరుపేదయయినట్టి యు, లోకజ్ఞానము తెలియనట్టియు నిరంతరము వ్యవసాయముసందే మునిగి తేలుచున్నట్టియు రైతుయొక్క స్థితినిన్ని సంపన్నుడైనట్టియు

కోర్టులకు సమీపముగా బస్తీలలో నివశించుచున్నట్టియు, పలుకుబడి గల్గితగు సిబ్బందిగల్గినట్టియు, జమీందారుయొక్క స్థితిని మనము గమనించినపుడు చట్టములో తెలిపినకోర్టులు గాని విధానముగాని జమీందారునకే యెక్కువ సహాయపడుచున్నవనుట అనుభవసిద్ధమే. రైతునకు సాగుహక్కు యిచ్చుటలో ఆయనకు సాంప్రదాయముగాయున్న చిరకాలపుహక్కును చట్టము స్థిరపరచినదేగాని క్రొత్తగా ప్రసాదించినదేదియు లేదు. సదరు సాగుహక్కు గూడ గ్రామములోని ప్రతిరైతునకు లేదు. (old vaste) 'పాతబంజరు,' "స్వంతసేరీ" అను కృత్రిమ కల్పనలు కల్పించి కొంతభూమిని విడదీసి జమీందారునకు సదరు భూములయందు నిరంకుశపు హక్కులను యీ చట్టము కల్పించి యున్నది. ముఖ్యముగా "పాతబంజరు" అను శబ్దమునకు మన మదరాసు రాజధానిలో వ్యాప్తిలేదు. అది బంగాళాటెన్నెన్సీ చట్టము నుండి అనుకరింపబడినది.

చట్టమునకు పూర్వమున్న దరిమిలాను, చెట్లహక్కు రైతునకు యివ్వవలసియుండగా ఉభయులకున్ను సగముగా పరిష్కారము చేసినది, చట్టము. భూమికి మరామ్మతు చేసుకొను సందర్భములో రైతునకు తగుసహాయము ఏమియు జమీందారు వలనలేదు. సాముదాయకభూములు అను నిర్వచనములో నుంచి చెరువుగర్భములు (Tank Beds) తప్పించుటవలన రైతాంగమునకుతీరనికష్టమువాటిల్లుచున్నది.

భూమియందు రైతునకు సాగుహక్కు లభింపచేసెదనని జమీందారునజరానా పుచ్చుకొనవచ్చును. భూమిపై జమీందారు చట్టమునకు పూర్వము నిరంకుశముగా విధించిన హెచ్చుశిస్తును తగ్గించుకొనుటకు చట్టప్రకారము తగు అవకాశము లేదు. సరిగదా చట్టమునకు పూర్వముండిన శిస్తు న్యాయమైన దను అసత్యాభిప్రాయము పై యీ చట్టము నిర్మింపబడినది.

ఉన్న శిస్తులనే యిచ్చుటకు సమర్థతలేని రైతాంగముపైన గింజలధరలు హెచ్చినవను కారణమువలన శిస్తును హెచ్చింప పూనుట అక్రమము. తాను ప్రభుత్వమువారికి చెల్లింపవలశిన పేష్కసు స్థిరమైన దైనపుడు వ్యక్తిమాత్రుడైన జమిందారునకు శిస్తును హెచ్చించుటకు అధికారముండుట మరింత అక్రమము. ఈ హెచ్చింపునకు సంబంధించిన సూత్రములు కూడ అక్రమములున్న అశాస్త్రీయములున్న అయియున్నవి. కేవలము గింజలుధరలు హెచ్చినవని రుజువుచేయుట మూలమున జమిందారు యిరువది సం॥ముల కొకమారు శిస్తును హెచ్చింపవచ్చును. కాని సదరు గింజలధర హెచ్చుట వలన రైతునకు ఎంతలాభము కలిగినదియు యిరువై సంవత్సరముల పూర్వముకంటే పరమందు రైతుయొక్క ఆర్థికస్థితి ఎంతవరకు బాగుపడినదియు జమిందారు న్యాయాధిపతియొక్క గమనికలోనికి తీసుకురావలసిన విధిలేదు.

యీ ఎస్టేటు ల్యాండుబిల్లు చర్చలోయుండిన కాలములో యీశిస్తు హెచ్చింపులు ఇక ముందు జరుగరాదని హైకోర్టువారు అభిప్రాయమును తెలిపియుండిరి.

చరాస్తిజప్తు అను పేరుతో జమీందారులు రైతుపై పగ తీర్చుకొనుటయు అతనిని అగౌరవమునకు లోనుచేయుటయు అనేకచోట్ల తటస్థించుచున్నది. చరాస్తి జప్తుచేయించి వేలం వేయించుటలో అనేకచోట్ల రైతునకు యిది తెలియకుండగనే జరుగుటయు బాకీకంటె అనేకరెట్లు కిమ్మతుగల భూమిని వేలం వేయించుటయు సదరు వేలంను గురించి తగిన ప్రచురణ జరుగకపోవుటయు తటస్థించుచున్నది.

జలాధారముల మరమ్మత్తుచేయుట విషయములో గాని అభివృద్ధిచేయుట విషయములో గాని నూతన నిర్మాణములుచేసి పల్లపు ఆయికట్ట వృద్ధి చేయుటలోగాని, ప్రస్తుతచట్టము రైతునకు ఎంతమా

త్రము సహకారిగా లేదు. పట్టాలను సబ్ డివిజను చేయుటలోను అన్యాక్రాంత మయినప్పుడు సదరు భూమి యితరుల పేర నమోదు చేయుటలోను జమిందారుడు శ్రద్ధ తీసుకొనక పోవుటవలన సదరుభూమిని క్రయము పొందినవారికిని క్రయపరచినవారికిన్ని కూడ చాలా చిక్కులు కలుగుచున్నవి. ఉన్నశిస్తులను రైతుయొక్క ఆర్థిక స్థితిని బట్టి సవరణచేసినగాని సర్వేసెటల్ మెంటుల వల్ల ఎంతమాత్రము లాభములేదు. ఎండుమురుగుల వలనను అనావృష్టి అతివృష్టివలనను పంటలు పోయినప్పుడు అధమము గవర్నమెంటు గ్రామాదులవలెనైన రిమీషను పొందుటకు రైతునకు యీ చట్టముక్రింద హక్కులేదు. జమిందారీ అడవులలోను కంచెలలోను రైతునకు గల ప్రాచీనకాలపు హక్కులను యీ చట్టము పొందుపరచి యుండలేదు. జమిందారునకు రైతునకు కూడ సమానబాధ్యతగల వ్యవసాయము యొక్క క్షేమమునకు గాను రైతును అడవులలో ప్రవేశమిచ్చుట ధర్మమను అంశమునుకూడ యీ చట్టము మరచిపోయినది. వేలకొలది రూప్యములు గ్రామములోని కష్టజీవులై కడుదరిద్రులై నట్టిరైతులవల్ల స్వీకరించుచున్న జమిందారు గ్రామముయొక్క ఆర్థికసాంఘిక నైతికాభివృద్ధికి విధిగా తోడ్పడవలెనను అంశమును యీ చట్టము గమనించుటలేదు.

యిందుమూలమున యీ చట్టము రైతుల ఆర్థికాభివృద్ధి కంతగా తోడ్పడలేదు. సరిగదా ధనవంతుడు సామంతుడునైన జమీందారుని నిరంకుశత్వమున కెక్కుడు అవకాశమును గల్పించినది. ఓటరుల సంఖ్య అధికముగా పెంచబడుచున్న నీరోజులలో జమీందారీ రయితునకు చట్టము క్రింద యేర్పడిన ఆర్థికదాస్యము చట్టసవరణమూలముగా నివారింపబడని యెడల వీరికి ప్రస్తుతముగల రాచకీయ దాస్యశృంఖలములు ముందు మరింత దృఢములై, అందువలన సంఘక్షేమము ప్రమాదించును.

---

# యీచట్టము సంస్కరింపవలెనని యాందోళనము

ఈ చట్టము రైతుయొక్క క్షేమమును కాపాడజాలకపోయినది. జమిందారులు కూడ ప్రభుత్వములో తమకు గల పలుకుబడివల్ల యీ చట్టమును యింకను సంకుచితపర్చితమపూర్వనిరంకుశపు హక్కులను ఇంకను బలముగ స్థాపించుకొనుటకు ప్రయత్నించుచున్నారు. మరియు యీ చట్టములోని భాష అనేకసంధిగ్ధార్థములకు అవకాశమిచ్చుటవల్ల యీ చట్టముపైన పుట్టబడ్డ హైకోర్టుతీర్పులకన్న చట్టముయొక్క భాషకున్న చట్టముయొక్క తాత్పర్యమును పురస్కరించుకొని సామరస్యమును కుదర్చవలసి వచ్చినది. మొదటికారణముటుంచి కొంతవరకు రెండవకారణమును ముఖ్యముగా మూడవకారణమును ప్రభుత్వమువారిని యీ చట్టముయొక్క సవరణలోనికి దింపినది. యిందునుగూర్చి ప్రభుత్వమువారు 1913 లోనే సవరణబిల్లును శాసనసభలో ప్రవేశపెట్టిరి. 1914 లో దీనికి 4 సవరణబిల్లులు సభ్యులచే ప్రతిపాదింపబడినవి. ఈ అవకాశములో వీలయినన్ని నిరంకుశపుహక్కులను పొందవలెనని జమిందారులున్న వీలయినంతవఱ్కు రైతుయొక్క క్షేమమును కాపాడవలెనని కొందరు దేశాభిమానులున్న శాసనసభలో పెనుగులాడజొచ్చిరి. కాని రైతుపక్షమున అప్పుడు ప్రస్తుతమున్నంత ఆందోళనము కూడలేదు. ఇంతలో ఐరోపా మహాసంగ్రామము వచ్చుటచే ప్రభుత్వమువారు యీ సవరణలకు వాయిదావేసి, యుద్ధాసంతరమనగా 1922–24 లలో యీ బిల్లుతిరిగి రయితుల ఆందోళన వలన చర్చకు తీసుకొని రాబడి ఒక ఉపసంఘమునకు యీ సవరణాంశములను యోచించుటకై రిఫరు చేయబడెను. తిరిగి 6 సం॥లు ప్రభు

స్వామువారు యిందుకుగూర్చి వాయిదా వేసిరి.

యీ విషయము శాసనసభలో చర్చకువచ్చిన మొదల రైతు క్షేమకృత్యావసరణలు యుపాదింపబడి నెగ్గగలవనియు అందువలన జమిందారులకు ప్రభుత్వముపై ఆగ్రహము జనించగలదనియు ప్రభుత్వమువారికి భయమని తోచుచున్నది.

1928 వ సంవత్సరములో సదరు ఉపసంఘమువారు చేసిన సూచనప్రకారము ఒకబిల్లును తయారుచేసి 1931 సం॥ జూలైలో ప్రచురించి ప్రస్తుతశాసనసభ యొక్క అవసానకాలములో శాసనసభలో రైతు ప్రతినిధులు లేనిసమయములో దేశముయొక్క దృష్టి అఖండ రాచకీయాందోళనమందు లగ్నమై యున్న తరుణమున శాసనసభలో ప్రవేశపెట్టి దీని చర్చకై ఒకఉపసంఘమును 1932లో నియమించిరి. ఈ ఉపసంఘములో రయితుపక్షమునకు ప్రాతినిధ్యములేదు. వారిచేతిలో ఈబిల్లు మరింత కర్కశమైన దనుటలో ఆశ్చర్యమేమి ?

1923 సం॥నుంచి ఆంధ్రదేశములో జమీందారీ రైతుల క్షేమము నిమిత్తము కృషిచేయుచున్న ఆంధ్రరాష్ట్రీయ జమీందారీ రైతు సంఘమువారును, మదరాసురాజధాని రైతుసంఘమువారును నెల్లూరు, పశ్చిమగోదావరి తూర్పుగోదావరి, విశాఖపట్నంజిల్లా సభలవారును, అనేకతాలూకాలలోను గ్రామములలోను సభలు జరిపియు సహస్రములకొలది తీర్మానములను, మహజరులను యీ బిల్లును ప్రస్తుతము ఆపుచేయవలెననియు జమిందారుల యొక్కయు రైతుసంఘముల యొక్కయు ప్రతినిధులతో సంప్రతించి మరియొకబిల్లును తయారుచేసి ప్రభుత్వమువారు శాసనసభలో ప్రవేశపెట్టవలెనని కోరుచు ఆందోళన జరిపిరి. యీ సందర్భములో వెంకటగిరిలో 1931 ఆగస్టులో జరిగిన ఆంధ్రరాష్ట్రీయ జమీందారీ రైతుమహాసభయు జిల్లాసభను జరుపరా

దని నసుస్థానమువారి ప్రోద్బలము పైన అధికారులు 144 శెక్షను ప్రయోగించుటయు సదరు మహాసభలు జయప్రదముగ జరుప బడుటయు కూడా యీ వుద్యమముయొక్క భావి విజయమునకు సూచనలు. పిమ్మట యిట్టి సందర్భములో 144 వ శెక్షను ప్రయోగించుటలో కలెక్టరుగారు పొరబడిరని ప్రభుత్వమువారు శాసనసభలో తెలిపిరి. పిమ్మట వెంకటగిరిరయితులకున్ను జమీందారునకున్ను జరిగిన సంఘర్షణము, ఆసందర్భములో రైతులు జిల్లాజమిందారీ రైతు సంఘ యాజమాన్యమున చూపిన సంఘీభావమున్ను ఉద్యమమునందు నూతనాధ్యాయసూచికములు. తిరుత్తని జమీన్ రయితు సంఘము వారి కృషి కూడ నీఉద్యమవికాసమున కెంతయు తోడ్పడినది. ప్రభుత్వమువారిచే ప్రవేశపెట్టబడిన బిల్లులోని ముఖ్యాంశములు:

(1) ఒకగ్రామముకంటె తక్కువైన పరిమితిని ఎస్టేటు అను నిర్వచనముక్రింద చేర్చరాదు.

(2) ప్రస్తుతచట్టములో వలెగాక రైతు తనపొలములోని చెట్లను కేవలము తన ఉపయోగమునిమిత్తమే గాకుండా సెక్షను (12) విక్రయముకూడా చేసుకొనవచ్చును.

(3) శిస్తు హెచ్చింపుకుగాని తగ్గింపుగాని యిదివరలో వలె స్టాంపు పెట్టి దావాలు చేయనక్కరలేదు. పిటీషను పెట్టిన చాలును.

(4) శిస్తుఅను నిర్వచనముక్రింద బీటిశిస్తు చేలపన్ను మొదలగునవి చేర్చవలెను. అడవిపన్ను కూడా చేర్చవచ్చును. అందువలన వీని కొరకుకూడ జమీందారు చరాస్తిని జప్తుచేయవచ్చును.

(5) జమిందారు తన ఏజంటును వ్రాతమూలకమైన అధికారముతో నియమించవలెను (సెక్షను 62)

(6) గింజలరూపకముగా శిస్తుఉన్నచోట భూమినుండి జమీందారుయొక్క పాలు ధాన్యముచేర్చవలసిన స్థలము మూడుమైళ్ళకు

మించియున్న యెడల సదరు కిరాయి (cartage) జమీందారే పెట్ట
వలెను.

(7) జలాశయములు మరామ్మత్తు కావలసినపుడు రైతుల
తమ అర్జీతోపాటు రెండువందల రూపాయిలు ధరావతుకూడ కట్ట
వలెను. కలక్టరు మరామ్మత్తు చేయించవలశినదని జమిందారునకు
తెలియపర్చిన తరువాత జమిందారు నిరాకరించినప్పుడు ప్రస్తుతచట్ట
ము 139-140 క్రింద రైతులు పెట్టుబడిపెట్టి మరామ్మత్తు చేయిం-
నప్పుడు సదరు మరామ్మత్తుసొమ్ము వడ్డీతో ప్రభుత్వమువారు (arear
of Revenue) ఎరియర్సు ఆఫ్ రివిన్యూక్రింద రాబట్టి రైతు
యిప్పించవలెను.

(8) ప్రస్తుతచట్టము 144 సెక్షను ప్రకారము పట్టాలు మార
చేయవలశి వచ్చినప్పుడు సదరు భూమిపైన అప్పటికియున్న యావత్
బాకీ తీర్మానము కాలేదని కారణముచే జమీందారు సమోదు
యడము నిరాకరించవచ్చును. లంకభూముల సాగుహక్కు యిచ
టను గురించి పరిష్కరించుటకు కలెక్టరుకు అధికారము యున్నది.
చిరకాలము రైతుయొక్క ఆధీనములో యున్నట్టియు మార్పుదల
దనట్టి లంకలు సాగుహక్కును పొందదగినవనియు ప్రవాహవ
వలన మార్పుదల చెందిన లంకలు పొందదగనివనియు సామాన్యవి
యములు. మిగిలిన సవరణలన్నియు శబ్దముల మార్పునకున్న హక్కు
లను మరింత స్పష్టపరుచుటకున్న ఏర్పడినవి.

---

4 వ అధ్యాయము

# దేశసంపదకు ప్రధానాంగమైన రైతుయొక్క క్షేమమునకు గాను యీ చట్టము ఎట్లు సంస్కరింపవలెను?

ఈ అంశమును గూర్చి ఆంధ్రజమిందారీ రైతుసంఘమువారు ది 30-11-29 ని ఒక ఉపసంఘము నియమించిరి. ఆ ఉపసంఘము వారు ఒక ప్రశ్నావళిని ప్రచురించి దానిపై కొన్ని జమిందారీలనుండి సమాధానములు పొందబడినవి. వివిధప్రదేశములలో సమావేశములు చర్చలు జరుపబడినవి. దీనిఫలితముగా 1931 సం॥ ఆగష్టులో యీ క్రింది కొన్ని ముఖ్యసూచనలు చేయబడినవి.

(1) యీ చట్టము వెంకటాపురం నగరం తాలూకాలకు వర్తింపచేయబడవలెను.

(2) "పాతబంజరు" (old-waste) "శేరీభూములు" అను మిన హాయింపులు రద్దుకావలెను. జమిందారు స్వంతముగా వ్యవసాయము చేయుభూమి తప్ప మిగతాభూమి యావత్తు రైతీభూమిగా పరిగణింప వలెను. ప్రతిగ్రామములోను వ్యవసాయపుభూమి పరిమితినిబట్టి తగినంత భూమి అడవులనుండి కేటాయించిగాని లేక బీడుక్రింద ఏర్పరచిగాని ఉచితముగా పశువుల మేతకై కేటాయింపబడవలెను.

(3) చట్టమునకు పూర్వమున్న పరమందును భూమిలోయున్న చెట్లు అన్నియు ఎట్టి నిబంధనలతో నిమిత్తము లేకుండ రైతునకే చెందవలెను.

(4) సెక్షను 20 లో చెఱువులు అను శబ్దము చెఱువుగట్లు చెఱువుగర్భములకు కూడ వర్తింపజేయవలెను.

(5) నజరానాలు ఉండరాదు.

(6) జమిందారు తన స్వంతఖర్చుపైన అభివృద్ధి పనులుచేయించిన తప్ప శిస్తులు ఎన్నడు హెచ్చింపరాదు. గింజలధర హెచ్చును బట్టి శిస్తు హెచ్చింపు యెంతమాత్రము జరుగరాదు.

(7) కాలమానముల స్థితినిబట్టి భూమిపైన శిస్తును కాపుదల (Suspension) చేసికొనుటకున్ను తగ్గించుటకున్ను రైతునకు చట్టరీత్యా అవకాశముండవలెను.

(8) భూమియొక్క పరిమితిని నిర్ణయించునపుడు హద్దులను ముచ్చల్కాలలోని షరతులను ముఖ్యముగా గమనించవలెను.

(9) కిస్తీలను మహాశూలు అయిన మాసమునకు పిమ్మట నుంచి ప్రారంభించవలెను. ఏ పరిస్థితులలోను జనవరికి పూర్వము కిస్తీయుండరాదు.

(10) రైతుకోరిన స్థలములలో నెల్ల గింజలరూపకముగాయున్న శిస్తు నగదురూపకముగా మార్చవలెను.

(11) శిస్తు బాకీకై రైతుయొక్క భూమిని అమ్మరాదు.

(12) జమీందారు జలాశయముల మరామత్తు చేయుటకు నిరాకరించినపుడు ప్రభుత్వము తగుపెట్టుబడి పెట్టి ఆ పని చేయించి జమీందారునివల్ల తమ ఫీమ్కుతో బాటు రాబట్టుకోవలెను. సదరు జలాశయమును జమీందారు మరామ్మత్తుచేయ నిరాకరించినందువల్ల మరామ్మతు పూర్తిఅగు లోపల రైతుకు కలిగిన నష్టమునకు జమిందారువల్ల కలక్టరు పరిహారము యిప్పించవలెను.

(13) జమిందారీలలోని ఆనకట్టులు మున్నగునవి కట్టి పల్లపు సాగుకు వృద్ధిచేయుటకు వీలుకలిగిన వాగులు నదులు మున్నగునవి

వ్యవసాయక్షేమమునకు గాను, అవసరమని తోచినప్పుడు ప్రభుత్వము వారు స్వాధీనపరచుకొని వాటికి తగు కట్టడములు కట్టి వ్యవసాయమును అభివృద్ధి పరచుటకు అవకాశముండవలెను. యిట్లుచేయుటలో సదరు జలాశయము లేక వాగుక్రిందయున్న పూర్వపు ఆయకట్టుటకు ఉచితముగా నీరు యివ్వవచ్చును.

(14) జమీందారు రైతునకు మధ్యగల వివాదము పరిష్కరించు న్యాయస్థానములు సంచారన్యాయస్థానములుగా నుండి గ్రామములలోనె కేసులు విచారింపబడవలెను.

(15) జమిందారునకు గ్రామముపై వచ్చు శిస్తులో రూపాయకు రు 0-1-0 కు తక్కువ కాకుండ గ్రామనిధికి యివ్వబడవలెను.

(16) జమీందారీ అడవులలో రైతునకు సాంప్రదాయసిద్ధముగా యున్న, వంటచెర్కు, నాగటికఱ్ఱ, కసవుకు హక్కు గమనింపబడవలెను.

(17) ప్రస్థుతమున్న హెచ్చుశిస్తులు రైతు ఆర్ధికస్థితి, అజబాజు గవర్నమెంటు రేట్లనుబట్టియు సవరణకావలెను,

ఇందులోని అంశములు చాలభాగము శ్రీరామదాసుపంతులుగారు పిమ్మట తయారుచేయించిన సవరణబిల్లులో కనబడుచున్నవి.

---

# భవిష్యత్తు

---

ది 5–11–32 తేదీని అయినపర్రులో జరిగిన తణుకు తాలూకా జమీందారీరైతు మహాసభలోని గ్రంథకర్తయొక్క అధ్యక్షోపన్యాస భాగములు. (11–7-32 ఆంధ్రపత్రిక నుంచి) చుక్కలు పెట్టబడిన

భాగములు యిటీవల చేర్చబడినవి.

దేశచరిత్రయందును జమీందారీ రయితు ఉద్యమచరిత్రయం దునుకూడ ప్రాముఖ్యమయిన యీ తరుణమున సమావేశమయిన మీసభ ధన్యమైనది. దేశములోని భూభాగములో సగమునకు పైగా జమీందారీలకు చెందియున్నది. దేశపు ఆర్థికాభివృద్ధికి అవసరమయిన నదులు, తటాకములు, ఖనిజములు, అరణ్యకసంపత్తు అధికముగా యీ జమీందారులలో నిరుపయోగముగ పడియున్నది. దేశములోని జనసంఖ్యలోను ఓటర్ల సంఖ్యలోను కూడ అధికభాగము యీజమీందారీలలోనేయున్నారు. కాని దేశముయొక్క అజ్ఞానమునకు, దారిద్ర్యమునకు, సంఘీభావములేమికి యీజమీందారీప్రదేశములే గర్భగుళ్ళు. భారతదేశపు ఆర్థికసంపదకు వెన్నెముక అయిన జమీం దారీ రయితుల ఆర్థికపరిస్థితి బాగుపడినగాని దేశమునకు ఎట్టి శాంతి సౌఖ్యములును ఉండజాలవు.

నేడు రష్యా, యిటలీ, అమెరికా మున్నగు దేశములలో కృషీ వలుల అభివృద్ధికయి అనేకజయప్రదమయిన పరిశోధనలు చేయబడు చున్నవి. రష్యాలో నేటికి యించుమించు పరిసమాప్తమయిన పంచ వర్షవిధానముక్రింద దేశములో యించుమించు ప్రతివ్యక్తికిని వృత్తి కల్పింపబడినది. పంటలు దిగుబడి రెట్టింపుకు వృద్ధిఅయినది. "వాల్గా" నదిలోనుండి తీయబడిన విద్యుచ్ఛక్తివలన సదరు జిల్లాలోని ప్రతి గుడిసెలోను కూడ విద్యుచ్ఛక్తితో వంటలు జరుగుచున్నవి. సంకల్ప బలమున్నచో మనమును పై దేశములవలె ఆర్థికాభివృద్ధిని పొంద గలము.

## హెచ్చు శిస్తులు

1871 సంవత్సరము ఆ ప్రాంతములో వచ్చిన చొక్కలింగము పిళ్లై కేసులోని హైకోర్టుతీర్పునకు పిమ్మటను 1908 సంవత్సరము

యెస్టేటు ల్యాండు చట్టమునకు పూర్వమును జమీందార్లు రైతులపై శిస్తులను విపరీతముగా హెచ్చించిరి. ఎస్టేటుల్యాండు చట్టము సదరు శిస్తులయొక్క న్యాయాన్యాయమునుగూర్చి విమర్శింప పూనలేదు. పైగా యీ అధికశిస్తులనే యిరువది సంవత్సరముల కొకసారి గింజల ధరలు హెచ్చినవని కారణముచెప్పున రూపాయికి 0-2-0 చొప్పున హెచ్చించుటకు అవకాశ మీయబడినది. కాలమానస్థితినిబట్టి రైతువారీ రైతువలెనైన రెమిషను పొందుటకు జమీందారీ రైతునకు హక్కులేదు. ఇక కోర్టుద్వారా స్టాంపుఖర్చులు, ప్రయివేట్లు పెట్టి తినుటకు కూడులేని రైతు శిస్తుతగ్గింపు దావాకుదిగుట అసంభవము.

ప్రస్తుత ఆర్థికదుస్థితి జమీందారీ రైతును మరింత కృంగదీసినది. ప్రక్కరైతువారీ భూమి అయిదు రూపాయిలు రేటుకలిగియుండగా జమీందారీ జిరాయితీ యకరమునకు రు 11లు చొప్పున రేటు కలిగియుండుట నేను ఎరుగుదును. ప్రస్తుత ఆర్థికస్థితి యీ హెచ్చుశిస్తులను మరింత హెచ్చించినది. సదరు హెచ్చుశిస్తుకొరకు యిదివరలో ధరలప్రకారము రెండున్నర బస్తాలును పన్నునిమిత్తము అమ్ముటయే కష్టమని తోచినరైతు నేటిధరప్రకారము అయిదుబస్తాలు వరకు అమ్మినగాని పన్నుభారమునుండి విముక్తుడు కాజాలడు.

### యెస్టేటుల్యాండు సవరణచట్టము

యెస్టేటుల్యాండు చట్టము రైతునకుగల సాగుహక్కును కొంత వరకు స్థిరపర్చినను పాతబంజరు "స్వంతశేరీ" హెద్దులు క్రింద పూర్వ నిరంకుశత్వమును సాగించు చున్నది. నీటివనర్లు మరమ్మతులు చేయడము విషయములో పశువులమేత రైతులకు అడవులు కంచెలలో గల హక్కులను కాపాడుటలోను, పట్టాలు మార్పుదలలోను, న్యాయస్థాన నిర్మాణము దానివిధానములోను దేశాభివృద్ధికి ప్రతికూలముగను రయితుపట్ల న్యాయవ్యతిరేకముగను ఉన్నవి. యిట్టిదోష

ములు సవరణ కావలెనని ఆంధ్రజమీందారీ రయితుసంఘము నెల్లూరు పశ్చిమగోదావరి గంజాము విశాఖపట్టణము మున్నగుజిల్లాలు సంఘములు మదరాసు రాజధాని రయితుసంఘమువారు ఆందోళనచేయుచుండిరి. ఆంధ్రజమీందారీ రయితుసంఘము వారు ఒక ఉపసంఘమును నియమించి యిందును గూర్చి ఒకసవరణ విధానమును సూచించిరి. కాని "రొట్టెకోరగా రాయి" ప్రసాదింపబడినది. యిరువది సంవత్సరములు నుండి రయితులు ఆతురతతో వేచియుండగా 1931 సంవత్సరములలో ప్రభుత్వమువారు ఒకసవరణబిల్లును శాసనసభలో ప్రవేశపెట్టిరి. ఈ బిల్లు పై దోషములను నివారించుటకు పూనుకొనలేదు సరిగదా అడవిమేత కుసుము, చేపలపాటమొత్తము "శిస్తు" అను నిర్వచనముక్రింద చేర్చియు లంకలను రైతీ, నాన్ రైతీ అను భేదములక్రింద చేర్చియు, జలాశయమరమ్మతుల విషయములో పెట్టు అర్జీలకు ధరావతు యేర్పర్చియు కొన్ని అపకృతులునుకూడా సూచించియున్నది. జమీందారుల ప్రాబల్యముతో నిండి రయితులకు తగినప్రాతినిధ్యము లేని అవసానకాలములో ఉన్న ప్రస్తుత శాసనసభలో యిట్టిబిల్లు పెట్టుటకు వీలులేదనియు పై సంఘములున్ను అనేకరయితు మహాసభలు తీర్మానించినవి. కాని ప్రభుత్వమువారు వినలేదు. తమప్రయివేటు సవరణబిల్లునకు కూడ సభలో దీనితోపాటు అవకాశము యివ్వవలసినదని ప్రజాప్రతినిధులు చేసిన విన్నపముకూడ ఆలింపబడలేదు. ఈ సందర్భములలో గతసాలున వెంకటగిరిలో జరిగిన మహాసభలకు 144 ప్రయోగించుటకూడ తమకు తెలిసియే యుండును.

ఈ సవరణబిల్లు జమీందారుల ప్రాబల్యము కలిగిన ఒక సెలక్టు కమిటీకి రిఫర్ కాబడి వారి రిపోర్టుతో నేడో రేపో శాసనసభలోనికి చర్చకు రానైయున్నది. ఇట్టికమిటీవారి చేతులలో యీ బిల్లులో గల ప్రతికూలసూచనలు మరింత ఘనీభవించినవి. (* ఈసవరణను

గూర్చి 9-4-33 తేదికి ప్రజాభిప్రాయం ఇట్లున్నది. ఈబిల్లు జమీం దార్లు రైతులు కూడ నిష్ప్రయోజన మనుచున్నారు. రైతునకు కావలసిన సవరణలు సెలక్టుకమిటీలో జరుగకుండగను, తమకు అనుకూలముగా నున్న బిల్లులోని అంశములు పోకుండగా పదిలపరచుకొనుటలోను జమీందారులు కొంత విజయముపొందిరి. రైతుపక్షము బిల్లు శ్రీసామి వెంకటాచలంచెట్టిగారు 1933 ఆగష్టులో ప్రవేశపెట్టగలరుట. కాని ప్రధానరంగస్థలము శాసనసభనుండి గ్రామరైతు సభలకు మారినప్పుడే రైతుకు న్యాయముగల్గును.) ఇది సహింపజాలక రయితుపక్షమున మాట్లాడటము శ్రీమునిసామినాయుడుగారికి జస్టీసుపక్ష నాయికత్వమునుండి ఉద్వాస్యము కలుగుటకు గల కారణములలో నొకటి. ఇట్టిమహాతరుణములో జమీందారీ రైతులు తమన్యాయముకొరకై ధర్మబద్ధమైన తీవ్రాందోళనమును చేయుట కర్తవ్యము. శతసహస్రములుగా జమీందారీ రైతులు సదరుబిల్లు చర్చకు వచ్చునాడు శాసనసభాద్వారమున దీక్షితులై నిలచి శాంతియుతముగ సభ్యులు మీ అవేదనను గుర్తించునటుల చేసి శాసనసభను నిర్జనముగచేయు ఆత్మశక్తి మనకు నేడు లేదని నాకు తెలుసును. అయినను అట్టి దినములను నేను స్వప్నములలోనైన చూచుటకు కోరుచుందును. ఈబిల్లువిషయములో ప్రభుత్వము తటస్థులుగా నుండుట కనిష్టధర్మము. ఈబిల్లు శాసనసభలో చర్చకు రాకుండ నిరోధింపవలెనని తమవోట్లను పొందిన ప్రతినిధులకు మీరు స్పష్టముగా తెలుపవలెను. గ్రామపంచాయతీలు, జిల్లా, తాలూకా బోర్డులు మున్నగు సంస్థలు ఇందును గూర్చి తీర్మానించి సానుభూతి చూపవలెనని కోరుచున్నాను.

జమీందార్లకు రైతు క్షేమముకంటె ప్రత్యేకక్షేమములేదు. అందుచే వారు రైతుసంఘము సేవించి తద్వారావారి ఓటునుపొంది శాసనసభలలో ప్రవేశించ వలెనేగాని వారికి ప్రత్యేక ప్రాతినిధ్యము

మనము అంగీకరింపజాలము. ప్రస్తుత లా ప్రకారముకూడ వారు రైతు వల్ల ప్రభుత్వపుఆదాయమునువసూలుచేయుటకు యేర్పడినవారుగామాత్రం పరిగణింపబడుచున్నారు. (Farmers of Public Revenue) ఈ సందర్భములో లోథియను సంఘమువారు మెకానల్డు ప్రభుత్వము వారుచేసిన సూచనలును అంగీకరింపజాలము.

నేడు మనము స్వరాజ్యము కొరకు తపించుటలో మన దేశము యొక్క ఆర్థికస్థితిని బాగుపరచుటయే ముఖ్యోద్దేశమని నా యభిప్రాయము.

స్వరాజ్యసిద్ధికి అనంతరము ఒకక్షణమైనను ఆలసింపక దేశములోని బుద్ధిమంతులు సమావేశమై ఒక ఆర్థికవిధానమును నిర్ణయించి దానిని శాసనబద్ధముచేసి, ఆప్రకారము కృషిసల్పి, దేశపునిరుద్యోగము, దారిద్ర్యము, ఆర్థికదాస్యమును పోనాడి, కార్మికులయొక్కయు, వ్యవసాయకుల యొక్కయు, ప్రస్తుత దుస్థితినిపోగొట్టి దేశముయొక్క నిర్మాణశక్తిని సర్వతోముఖముగ వికశింపజేయుటలో—ప్రజాళిలో నేడుగల "స్పర్థభావము (competitive spirit) స్థానే సహకార, సమరసభావములు (co-operative and collective spirit) న్ను, పొలములోను, యంత్రములోను, ప్రస్థుతమున్న యజమానసేవక భావము స్థానే ఆర్థికాద్వైతమును స్థాపించియు "ఉత్తమంస్వార్జితం విత్తం" అనున్యాయానుసారము ప్రతివ్యక్తియు, నిత్యము ద్రవ్యోత్పత్తికై పాటుబడి పిమ్మటనే భుజించవలెనను "ఆనందసూత్రము"ను గుర్తింపజేసియు, వ్యక్తియొక్క ఉత్పత్తివికాసములకు లక్ష్యము, సంఘకళ్యాణమే నను "తరంగసందేశము"ను స్థిరపరచియు; బలి రాజ్యములో వలె ప్రజలు, నిత్యసంపన్నులును, నిత్యతృప్తులును, మమకారశూన్యులునై, ఆయురారోగ్యములతో విరాజిల్లుచుండగా, భారత

వర్షము "కృష్ణగర్భ" యనునామమును సార్థకముజేసి తన్సందేశమును లోకమునకిచ్చి ధన్యులమగుటకు, అస్మదాది నవయుగభావసమన్వితుల మెంతయు నుత్సహించుచున్నాము. ఇట్టి విధానమున కవకాశములేని స్వరాజ్యమనిన మాకు అర్థములేనిశూన్యాక్షర శ్రేయమాత్రముగా నుండును.

జమీందారు లనిన వ్యక్తిగతముగ మనకు సోదరభావము ప్రేమ భావముతప్ప మరొకటిలేదు. "భారజల్లి" పరగణా గడ్డపైన నిలువబడిన నేను ధర్మపాలకులైన యీ ప్రాంతపు పూర్వపు జమీందారుడైన ఆ. నరసింహా అప్పారాయణంవారి దివ్యనామమును స్మరింపకుండజాలను. గ్రామగ్రామమునకు చెరువు దేవాలయము నిర్మించి ధర్మరాజని సాధువులు యొక్కగీతాలలో ఆయనయశస్సు అమృతత్వము పొందినది. నిశ్చల, నిష్కళంక దేశాభిమానులు ప్రస్తుత జమీందారులలోకూడ గలరు. కాని వ్యక్తులయందలి మనకు గల ప్రేమగౌరవములు సంఘక్షేమదృష్ట్యా మనముచేయు విమర్శనలకు అడ్డురాగూడదు. ప్రస్తుత మున్న యీ జమీందారీ పద్ధతి ఆచరణ, దేశాభివృద్ధికి మిక్కిలి ప్రతికూలములు. ఈ సమస్య పరిష్కారమైనకాని దేశమునకు ఎట్టి ఆర్థికాభివృద్ధియు కాజాలదు. ఇందులకు మూడుమార్గములు కనిపించుచున్నవి. 1. శాసనరూపముగ పర్మనెంట్ సెటిల్‌మెంటును రద్దుపరచి ప్రభుత్వము జమీందారీలను స్వాధీనపరుచుకొనుట 2. లేక అస్ట్రేలియా దేశములోవలె యీ జమీందారీలను కొనివైచుట. 3. ప్రస్తుత యెస్టేటుల్యాండు చట్టమును దేశక్షేమపరముగా దృక్పథము నందును విధానమునందును మార్పుట. ముఖ్యముగ పాతబంజరు స్వంతశేరీ హెడ్డులను తొలగించుట శిస్తులను రయతుయొక్క ఆర్థికస్థితినిబట్టియు అజబాజు గవర్నమెంటు రేటులనుబట్టి పునర్విమర్శనచేయుట. జలాశయ

ములు మరస్సుతువిషయములలోను నూతన నిర్మాణములను గూర్చియు పశువులమేత, రయితులకు అడవులు కంచలలో గల హక్కులును భద్రపర్చుట. ఈ విషయములలోను జమీందారు యొక్కయు ప్రభుత్వముయొక్క బాధ్యతలను నిర్వచించుట. గ్రామక్షేమమునకు జమీందారు తోడ్పడవలసిన బాధ్యతను నిరూపించుట. జమీందారుల వచ్చుబడిపై ఆదాయపు పన్నును విధించుట.

వీటిలో ఒకటికంటె మరొకటి (క్రిందినుండిపైకి) జమీందారుల దృక్పథములో కఠోరమైన సూచనలుగావచ్చును. కానియిందులో యే సూచనయు శాసనరూపము దాల్చవలసిన ఆవశ్యకతలేకుండచేయుటకు జమీందారులకు అవకాశముగలదని మనవిచేయుచున్నాను. రయితుకోటియొక్క ప్రస్తుత దైన్యతకు తాపముపొంది వారిక్షేమమునకు అవసరమయిన సంస్కరణములను హృదయపరివర్తనముతో జమీందారులు తామే ప్రారంభించెదు సుముహూర్తమును గూర్చి నేను మనఃపూర్వకముగా గోరుచున్నాను.

రైతుల మధ్యనివసించుచు రైతుయొక్క కష్టసుఖములలో తోడ్పడుటకు వారు సంసిద్ధులై యుండవలెను. ప్రస్తుత నాగరికనివాసములును భోగజీవితములును వారు త్యజింపవలెను. పరమేశ్వర సాక్షిగ నోరులేని రైతు కోటియొక్క క్షేమమునకు వారు ధర్మకర్తలమని నమ్మవలెను.

సోదరులారా! కాయకష్టము యొక్కయు పరిశ్రమయొక్కయు గౌరవమును పూర్తిగా మీరు గమనించవలయును. విశ్వపోషణకు ఆహారోత్పత్తికిని మనము కృషిచేయనివాడు అన్నము భుజించుటకు అనధికారులమని నమ్మవలెను. దేశతారకమైన కర్షకుని స్వదేశీయుని మీరు పూనవలెను. సంస్థానములవారీగా, జిల్లాలవారీగా, రాష్ట్రముల

వారీగా జమీాందారీ రయితుల సంఘములు స్థాపనకావలెను. సంఘశక్తితో ధర్మమునకై మీారు తీవ్రకృషిసలుపవలెను.

భారతవస్త్రపరిశ్రకుల చరిత్రమును, హిందూదేశమునకు ఋణమెట్లు

కలిగినది, భూమిపన్ను విధానము, రీసెటిలుమెంటు బహిరంగ

లేఖలు, వ్యాసములు, శాకుంతలము, దాని నూతన

సందేశము మున్నగుగ్రంథ, ఆంధ్ర, ఆంగ్ల వ్యాస

కర్తయైన రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ

ప్రణీతంబైన జమీాందారీ రైతు

సమస్యయను గ్రంథము

సంపూర్ణము.

"సర్వేజనాస్సుఖినో భవంతు."



# అనుబంధము 1

## ఆంధ్రదేశములో గవర్నమెంటు, యీనాం, జమీందారీ భూపరిమితిని తెలుపు పట్టీ.

( 1910 సం॥ స్టేటిస్టికల్ అబ్ స్ట్రాక్టునుబట్టి తయారుచేయబడినది. )

| జిల్లా | గవర్నమెంటు, యీనాం, పరిమితి | | | | జమీందారీ పరిమితి | |
|---|---|---|---|---|---|---|
| | గవర్నమెంటు గ్రామములు | గవర్నమెంటు పరిమితి యకరములు | ఈనాం గ్రామములు | ఈనాం పరిమితి యకరములు | జమీందారీ గ్రామములు | జమీందారీ పరిమితి యకరములు |
| గంజాం | 2472 | 2871951 + 64671 | 272 | 208695 | 3699 | 2217660 |
| విశాఖపట్టణం | 792 | 847204 + 50665 | 857 | 698697 | 12052 | 9425911 (805557; 246386) |
| కృష్ణా | 770 | 1630941 + 225158 | 319 | 345871 | 724 | 1194976 |
| గుంటూరు | 764 | 2913374 + 440258 | 162 | 200257 | 58 | 102681 |
| కర్నూలు | 696 | 4071228 + 694361 | 89 | 102589 | లేదు | లేదు |

| జిల్లా | గవర్నమెంటు, యినాం, పరిమితి | | | | జమీందారీ పరిమితి | |
|---|---|---|---|---|---|---|
| | గవర్నమెంటు గ్రామములు | గవర్నమెంటు పరిమితి యకరములు | ఈనాం గ్రామములు | ఈనాం పరిమితి యకరములు | జమీందారీ గ్రామములు | జమీందారీ పరిమితి యకరములు |
| బళ్లారి | 873 | 2983402 + 547583 | 89 | 114954 | లేదు | లేదు |
| అనంతపురం | 750 | 3714085 + 430947 | 136 | 130777 | లేదు | లేదు |
| కడప | 751 | 3214594 + 331964 | 218 | 216662 | లేదు | లేదు |
| నెల్లూరు | 508 | 2326182 + 204263 | 281 | 570990 | 918 | 1657817 (471687, 695289) |
| చిత్తూరు | 471 | 1756349 + 119751 | 599 | 232061 | 1920 | 1523631 |

3 వ కలంలో + గుర్తుతో మైనరు యినాం పరిమితి గవర్నమెంటు పరిమితి యేర్పడినది.

7 వ కలంలో బ్రాకెట్లలో మొత్తం పరిమితి మింజుమలె అడివి, పోరంబోకు క్రింద యున్న భాగం చూపబడినది.

# హెచ్చరిక

# ఆంధ్ర జమీందారీ రయితుల సంఘ సభ్యత్వము

"ఆంధ్ర జమీందారీలని (Estates) ప్రస్తుతము వ్యవహరింపబడుచున్న ప్రదేశములలోని, రయితుల యొక్కయు, వ్యవసాయకుల యొక్కయు, ఆర్థికపరిస్థితి బాగుపడిన గాని భారతదేశపు ప్రస్తుతఆర్థిక దుస్థితితొలగి ప్రజాక్షేమము గలుగజాలదుగాన అందులకై కృషిసల్పుటయే నీసంఘోద్దేశ్యము."

ఈసూత్రమునకు నేను సమ్మతించుచున్నాను.

సభ్యునిపేరు

గ్రామము జమీందారి వృత్తి

వయస్సు

తండ్రి లేక భర్త

సభ్యత్వము రు 0-2-0 లు చెల్లించిన తేదీ.

సభ్యుని సంతకము.

ఆంధ్రరాష్ట్రీయ జమీందారీరైతుసంఘమువారి, పై ప్రమాణ ప్రకారం ప్రతిరయితున్ను, సభ్యుడుగాచేరి, గ్రామ, లేక యెస్టేటు, లేక జిల్లావారీగా జమీందారీ రయితుసంఘముల నేర్పరుపుడు. వివరములకు రాష్ట్రసంఘస్థానీయుడైన గ్రంథకర్తకు వ్రాయుడు. పై ప్రకారం సంఘసభ్యులుగా చేరువారికి ఈ గ్రంథము 0-3-0 లు మాత్రమే. మరియు, ఇట్టి ప్రతి మూడణాలలోను 0-1-0 చొ॥ ఆంధ్రరాష్ట్ర జమీందారీ రయితుసంఘనిధి కివ్వబడును.

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయడుగారిచే రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రింపబడియె. 7712—1000—33.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B134 |
| పుస్తకం పేరు | హరిజనుల పాటలు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | B,20,41 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | rohith |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |